# పిల్లలలో చాలమంది అవసరమైనన్ని పాలు తాగరు



# అందుకే వారికి కావాలి కాల్షియం-శాండోజ్® బిళ్ళలు

**భారతదేశంలో చాలమంది పిల్లలలో కాల్షియం కొరత ఉంది**

మరి, మీ పిల్లలలో కూడానా ? మీ పిల్లలకు కావలసిన కాల్షియం పోషణ వారి పళ్ళకూ, ఎముకలకూ లభిస్తోందా అన్నది మీరే చూసి చెప్పగలరు. వారిలో అందరూ రోజుకు చెరో 3 పెద్ద గ్లాసుల పాలు తాగుతున్నారా? లేదు! అయితే వారికి కాల్షియం-శాండోజ్ బిళ్ళలు తప్పని సరిగా కావలసిందే.

కాల్షియం-శాండోజ్ గట్టిపళ్ళు, దృఢమైన ఎముకలు పెంపొందేందుకు తోడ్పడుతుంది. విటమిన్ సి, డి, బి12 తో బలపరచబడి, రాస్ప్బెర్రీ రుచిగల కాల్షియం-శాండోజ్ బిళ్ళలు బలే రుచికరమైనవి. పిల్లలు అవంటే ముచ్చట పడతారు.

కాల్షియం-శాండోజ్ — ప్రపంచంలో మేలైన కాల్షియం స్విట్జర్లెండ్ లోని శాండోజ్ వారు రూపొందించినది.



మీ పిల్లలకు రోజూ కనీసం 4 కాల్షియం-శాండోజ్ బిళ్ళలు కావాలి 2 బిళ్ళలు ప్రతిసారి భోంచేసే ముందు






1 2 3 4 5



# చందమామ

ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు


| | | | | | |
|---|---|---|---|---|---|
| కాకోలూకీయం | .... | 7 | వంశగౌరవం | .... | 38 |
| మాయాసరోవరం-20 | .... | 11 | వైద్యమూ, భేషజమూ | .... | 41 |
| రెండు రూపాలు | .... | 19 | గురువు చెప్పని విద్య | .... | 43 |
| డబ్బుకార్చే కన్నీరు | .... | 25 | పట్టుకుంటే పదివేలు | .... | 46 |
| దేవుడులాంటి అల్లుడు | .... | 29 | మాంత్రికుడు—రామచిలుక | .... | 49 |
| గుర్తింపు | .... | 34 | వీరహనుమాన్-35 | .... | 51 |


ఇవిగాక అమరవాణి, కథాశీర్షిక పోటీ, ఫోటో వ్యాఖ్యలూ వగైరా.


**Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI. CHANDAMAMA is published monthly and distributed in U.S.A. by Chandamama Distributors, West Chester PA 19380. Subscription 1 year $ 6-50. Second Class Postage paid at West Chester, PA.**

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [ "రెండు రూపాలు" ] టి. వి. నరసింహకుమార్ రచన.

సాధారణంగా పదవులూ, హోదాలూ గలవాళ్లు ప్రజల గుర్తింపు కోసం పాకులాడరు. ప్రజల మేలు ఎంతగా కోరే పాలకుడైనా అందరి మెప్పూ పొందలేడు. దానికి కారణం ఏమంటే, పాలకులు సమిష్టి ప్రజాజీవితం గురించి ఆలోచిస్తే, వ్యక్తులు సామాన్యంగా తమ జీవితం గురించే ఆలోచిస్తారు. ఎంతటి ప్రజారంజకమైన పరిపాలనలో కూడా అసంతృప్తి చెందేవాళ్ళు ఉంటారు. ఈ విషయం మనకు "గుర్తింపు" అన్న కథలో తెలుస్తుంది.

సంపుటి 61 అగస్టు '77 సంచిక 2

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00






న గృహాణి, న వస్త్రాణి,
న ప్రాకారా స్తిరస్క్రియాః,
నేదృశా రాజసత్కారా
వృత్త మావరణం స్త్రియాః. 1

[స్త్రీలకు ఇళ్ళూ, బట్టలూ, రాజభవనాలూ, తెరలూలాటి రాజమర్యాదలు ఆవరణాలు కావు.]

వ్యసనేషు, న కృచ్ఛ్రేషు,
న యుద్ధేషు, స్వయంవరే
న క్రతౌ, న వివాహే చ,
దర్శనం దుష్యతి స్త్రియాః. 2

[ఆపత్కాలంలోనూ, దుఃఖసమయంలోనూ, యుద్ధకాలంలోనూ, స్వయంవరం అప్పుడూ, యజ్ఞంలోనూ, వివాహంలోనూ స్త్రీ పరపురుషులకు కనిపించవచ్చు.]

సైషా యుద్ధగతా చైవ,
కృచ్ఛ్రే చ మహతిస్థితా,
దర్శనేస్యా న దోష స్స్యాత్
మత్సమీపే విశేషతః. 3

[ఈమె (సీత) యుద్ధభూమిలో ఉన్నది గనకనూ, మహా కష్టంలో ఉన్నది గనకనూ, మీదు మిక్కిలి నేను (రాముడు) ఇక్కడే ఉన్నాను గనకనూ సీత ఇతరులకు కనిపించవచ్చు!]
—(రామాయణం)

స్త్రీకి ఘోషా!






తమ నివాసాన్ని గురించి కౌజుపిట్టకూ, కుందేలుకూ చాలాసేపు వాదులాట జరిగింది. చివరకు కౌజుపిట్ట విసిగి, "ధర్మం, న్యాయంలాంటి వాటి మీద నీకు అంత నమ్మకం వుంటే, అవి తెలిసిన శాస్త్రజ్ఞుల దగ్గిరకు పోయి మన తగవు తీర్చుకుందాం. వాళ్లు ఎలాంటి తీర్పు యిచ్చినా దానికి నేను కట్టుబడి వుంటాను, మరి నీ మాటేమిటి?" అన్నది.

"సర్వం తెలిసిన శాస్త్రజ్ఞుల తీర్పుకు తలవంచనివాడు మహాపాపి. నేనూ, వాళ్ల తీర్పుకు బద్ధుడనవుతాను," అన్నది కుందేలు.

ఆ వెంటనే కౌజుపిట్టా, కుందేలూ తమ తగవు తీర్చి, న్యాయం చెప్పేవాడి కోసం బయలుదేరినై. ఏం జరుగుతుందో చూద్దామన్న కుతూహలం కొద్దీ నేను వాళ్ళ వెనకే బయలుదేరాను. దారిలో కుందేలు శీఘ్రగుడు, కౌజుపిట్టతో, "మిత్రమా! మనం ఎవరి దగ్గిరకు న్యాయం కోసం పోతున్నామో, చెప్పావుకాదే?" అన్నది.

ఆ ప్రశ్నకు కౌజుపిట్ట ఎంతో సంతోషంగా, "నదికి కొంచెం ఎగువున, ఇసుక తిన్నెలూ, పొదలూ వున్న ప్రాంతాన నివసించే దధికర్ణుడు అనే మార్జాలమౌని సంగతే నీకు తెలియదా? ఆయన ఒకప్పుడు అరణ్యంలో తన జాతి అడవి పిల్లులలాగే, ఘోర కృత్యాలు చేస్తూ జీవించాడు. తరవాత మనస్సు మారి, నదీ తీరంలో నివసిస్తూ, దైవ ప్రార్థనలో కాలం గడుపుతున్నాడు. ఆయన గొప్ప ధర్మశాస్త్రజ్ఞుడు," అన్నది.

త్వరలోనే అవి గమ్యస్థానం చేరాయి. అడవిపిల్లి తెగబలిసి ఉండటమూ, దాని



కోరలూ, చూపులూ మహా వాడిగా ఉండటమూ చూసి, కుందేలు లోలోపల బెదిరిపోయి, కౌజుపిట్టతో, "ఈ నీచుడైన దుర్బుద్ధిని సలహా అడగటంలో అర్థం ఏముంటుంది? ఇలాటి కపట సన్యాసులు ప్రతి పుణ్యనదీ తీరానా ఉంటారు," అన్నది.

ఈ మాటలు విని దధికర్ణుడు, తాను తన ఉదరపోషణ నిమిత్తం సన్యాసి వేషం వేసినప్పటికీ, తన వద్దకు వచ్చిన ఫిర్యాదులిద్దరినీ వంచించి, వాళ్ళకు తనలో నమ్మకం కుదిరేటట్టు చేయ నిశ్చయించింది. అందుకోసం అది కళ్లు మూసుకుని, సూర్యుడి కేసి తిరిగి, కాలు నేలకు సగం ఆనించి, చెయ్యి పైకెత్తి ఇలా నీతులు పలికింది :

"సత్యాన్వేషులారా, వినండి! ఈ జీవితం పరమ నిరర్థకమైనది. అది క్షణ భంగురం. ప్రియ సాంగత్యం వల్ల కలిగే సుఖం కలలోని దృశ్యాలవలె అవాస్తవమైనవి. భార్యా, పుత్రులూ, సంసారమూ ఇవి గారడీవాడి మాయా జాలం. అందుచేత పుణ్యకార్యాలు చెయ్యకుండా జీవించేవాడు శ్వాసించినప్పటికీ, వాడి శ్వాసకూ కమ్మరి కొలిమితిత్తి గాలికీ తేడా ఏమీ లేదంటారు. నీతి మాలిన జ్ఞానం, కుక్కతోకలాగ నిరుపయోగం—అది ఈగలను తోలటానికిగాని, మానం దాచటానికిగాని పనికిరాదు. చెట్టు అందం పూలూ, కాయలూ; పెరుగులోని సారం నెయ్యి; గానుగ చెక్కసారం నూనె; మనిషిలోని సారం ధర్మం. మీకు ధర్మం గురించి సూక్ష్మంగా చెప్పాను. ఇన్ని మాటలెందుకు? పరోపకారం పుణ్యం, పరపీడనం పాపం! మీరు ఈ ఒక్కమాటా గుర్తుంచుకుని, అలా ఆచరించండి, చాలు!"

ఈ ఉదాత్తమైన మాటలు విని కుందేలు కౌజుపిట్టతో, "నువ్వన్నది నిజం. ఈ పిల్లి నిజమైన సన్యాసి, మహా పుణ్య జీవి. పై ఆకారం చూసి నేను పొర

బడ్డాను. ఆయన పలుకులు నాలో విశ్వాసం కలిగించాయి. మన తగాదా తీర్చమని ఇతన్ని కోరుదాం,'' అన్నది.

''సరే! అయితే జన్మతః ఇది అడవి పిల్లి గనకా, మనకిద్దరికీ జన్మ శత్రువు గనకా, అపాయం లేకుండా దూరంగా నిలబడి మాట్లాడదాం,'' అన్నది కౌజుపిట్ట.

తరవాత ఆ రెండూ దూరంగా నిలబడి ఇలా అన్నాయి :

'''ఓ మహాత్మా, సుబోధకా! మా ఇద్దరి మధ్యా ఒక తగాదా వచ్చింది. ధర్మశాస్త్ర కోవిదులైన తమరు మా తగాదా ధర్మ సమ్మతంగా పరిష్కరించాలి. మాలో ఎవరి ఫిర్యాదు అక్రమమైతే వారిని తమరు భక్షించవచ్చు.''

''మిత్రులారా, నాతో అలాటి మాటలు అనకండి. ప్రాణులను చంపి తినటం నరక హేతువు కావటం చేత నేను ఆ అలవాటు ఏనాడో మానేశాను. మతంలో అహింస పరమధర్మం కావటం చేత, పేలూ, నల్లులూ, దోమలూ లాటి వాటిని కూడా చంపరాదంటారు. ఇతర ప్రాణులను తిని జీవించే ఘాతుక మృగాలను చంపేవాళ్ళు కూడా ఘోర నరకానికి పోతారట. అలాటప్పుడు నిరపాయమైన ప్రాణులను చంపేవారికి నరకం ఎలా తప్పుతుంది. యజ్ఞాలలో పశువులను బలి ఇచ్చేవారు కూడా వేదాలను సరిగా అర్థం చేసుకోని మూఢులే. చెట్లను నరకటమూ, జంతువులను చంపటమూ, రక్తపాతం కలిగించటమూ, వీటితో మనిషికి స్వర్గం లభించే మాటుంటే, ఏం చేసిన వాళ్ళు నరకానికి పోతారు? ఆ మాట ఈ మూఢులు ఆలోచించారా? అదంతా అలా ఉండనివ్వండి. నేను మీలో ఒకరిని తినాలన్నది అసంగతం. అలా ఎన్నటికీ చెయ్యను. నా ధర్మం నేను నెరవేర్చి, నా బుద్ధికి తోచిన విధంగా మీకు తీర్పు చెబుతాను. నాకు వయసు మళ్ళింది. అంతబాగా వినపడదు. మీరు దగ్గిరికి వచ్చి, మీ ఫిర్యాదేమిటో చెప్పండి.'' అన్నది దధికర్ణుడు.



# 188. ఇదేనా గండభేరుండం?

ప్రపంచం మీద రాక్షసిబల్లు లుండిన కాలంలో ఆర్కియోప్టెరిక్స్ అనే ఎగిరే జంతువు ఉండేది. దాని రెక్కలలోనూ, తోకలోనూ ఈకలుండేవి. దాని నోట్లో దంతాలు కూడా ఉండేవి. బవేరియాలో రాతి పొరల మధ్యన ఏర్పడిన దాని దేహ ముద్రను బొమ్మలో చూడవచ్చు.





# మాయాసరోవరం

## 20

[మాయాసరోవరాన్ని చేరటానికి, సర్పనఖుడి సహాయం అవసరం అని జయశీలుడు భావించాడు. సర్పనఖుడు ముందుగా తన తమ్ముడు ఎక్కడ వున్నాడో తెలుసుకోదలిచాడు. నరవానరం యజమాని కృపాణజిత్తు కంటబడగానే, అతడు జలాశ్వం మీద వెంట బడ్డాడు. పారిపోతున్న కృపాణజిత్తును మృత్యువృకం కొమ్మ పట్టుకున్నది. తరవాత--]

మృత్యువృక్షం కొమ్మ ఒకటి కృపాణజిత్తు తల పట్టుకుని కొంచెం పైకి గుంజగానే, ఆ కొమ్మకు దాపులనున్న మరి రెండు చిన్న కొమ్మల్లో ఒకటి అతడి భుజాన్నీ, మరొకటి చేతినీ ఒడిసిపట్టుకుని చప్పున పైకిలాగినై. కృపాణజిత్తు వాటి పట్టును విడిపించుకునేందుకు కాళ్ళూ, చేతులూ ఆడిస్తూ, "రక్షించండి! రక్షించండి!" అంటూ అరవసాగాడు.

కృపాణజిత్తు ఆర్తనాదాలు విన్న మరుగుజ్జు లెవరూ అతడికి సాయపడేందుకు ప్రయత్నించలేదు. ఏ పరిస్థితుల్లోనయినా సరే, మృత్యువృక్షాన్ని సమీపించటం అంటే వాళ్ళకు తగని భయం. పైగా, యీ కృపాణజిత్తువల్ల వాళ్ళు లోగడ నానా అగచాట్లూ పడివున్నారు. జలాశ్వాన్ని మాత్రం మరుగుజ్జుల్లో కొందరు పారిపోకుండా పట్టుకున్నారు.



కొంచెం దూరంలో రాళ్ళగుట్ట మీద నిలబడివున్న జయశీలుడూ, సిద్ధసాధకుడూ, గుట్టదిగి పరుగు పరురున మృత్యు వృక్షం దగ్గిరకు వచ్చేలోపలే, సర్పనఖుడు జలాశ్వం మీద అక్కడికి వచ్చి, "నా తమ్ముడు ఎక్కడవున్నదీ ఎరిగిన ఒక్కగా నొక్కడూ చచ్చిపోతున్నాడు, కాపాడాలి!" అంటూ కృపాణజిత్తును పట్టుకున్న కొమ్మల్లో ఒకదాన్ని తన కత్తితో బలంగా కొట్టాడు.

ఆ దెబ్బకు మృత్యువృక్షం బోదెనుంచి, చివరికొమ్మల వరకూ బలమైన గాలి తాకిడికి ఊగినట్టు ఊగిపోయింది. ఆ వెంటనే చిన్న మూలుగులాంటిది వినిపించింది. మరుక్షణం బొటనవేలంత లావుగల పొడవాటి కొమ్మ ఒకటి పాములా మెలికలు తిరుగుతూ కిందికి వంగి, సర్పనఖుడి మెడను చుట్టుకున్నది. సర్పనఖుడు, "హా, మాయాసరోవరేశ్వరా, రక్షించు!" అంటూ కీచుమన్నాడు. జలాశ్వం బెదిరి ముందుకు పరిగెత్తింది.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ ఒక్క దూకున అక్కడికి వచ్చారు. సిద్ధసాధకుడు సర్పనఖుడి రెండు కాళ్ళూ పట్టుకుని కిందికి లాగుతూండగా, జయశీలుడు కత్తి దూసి, సర్పనఖుడి మెడను చుట్టబెట్టిన కొమ్మను ఒక్క వేటున నరికాడు. సిద్ధసాధకుడు, సర్పనఖుడి తల నేలకు కొట్టుకోకుండా, అతణ్ణి తలకిందులుగా ఎత్తి పట్టుకుని, "ఒరే, నీటిపక్షి వెధవా! నువ్వు చేసిన దుస్సాహసంవల్ల, మాకు మాయాసరోవరానికి వెళ్ళే మార్గం చెప్పేవాడు లేకుండా పోయేవాడు!" అంటూ సర్పనఖుణ్ణి కాళ్ళమీద నిలబెట్టాడు.

సర్పనఖుడు రెండు చేతులతో మెడ పట్టుకుని బాధగా ఒకసారి మూలిగి, "నాకు తెలుసు, మాయాసరోవరేశ్వరుడు తన సేవకులను ఆపదలనుంచి తప్పక కాపాడతాడు," అన్నాడు.

ఆ మాటలకు సిద్ధసాధకుడు కోపంగా పళ్ళు కొరికి, "ఒరే, సర్పముఖం!

ఇప్పుడు నిన్ను కాపాడింది నీ యజమాని అనుకుంటున్నావా ? '' అని అడిగాడు.

'' స్వయానా అయన యిక్కడికి రాక పోవచ్చు; కాని మీ యిద్దర్నీ ఆవేశించి, నన్ను రక్షించాడు ! '' అంటూ సర్ప నఖుడు తల ఎత్తి మృత్యువృక్షం కేసి చూసి, అక్కడ కొమ్మలనుంచి వేళ్ళాడు తున్న కృపాణజిత్తు కంటబడగానే, '' హాం, నా తమ్ముడు సర్పస్వరు డెక్కడ వున్నదీ తెలిసినవాడు చచ్చిపోతున్న ట్టున్నది. రక్షించాలి ! '' అంటూ వృక్షం కేసి పరిగెత్తబోయాడు.

జయశీలుడు అతడి భుజం పట్టుకుని వెనక్కులాగి, అక్కడ చేరిన మరు గుజ్జులతో, '' మీ సేనాని ఎక్కడ? ఇతగాడికి ప్రాణభయంతో మతిస్థిమితం తప్పింది. నదిలో నాలుగైదుసార్లు ముంచి, గట్టున ఎండబెట్టండి," అన్నాడు.

మరుగుజ్జు సేనానీ, అతడి అను చరులూ వచ్చి పట్టుకోగానే సర్పనఖుడు పెద్దగా కేకలుపెట్టి, '' నాకేం మతి స్థిమితం తప్పలేదు, అంతా తెలుస్తూనే వున్నది ! మీరు మరుగుజ్జులు; వాళ్ళు జయశీలుడూ, కాపాలికుడూ; మన ముందున్నది మొసళ్ళ నది ! '' అన్నాడు.

'' ఒరే, నీటి మనిషీ, యిక నోరు ముయ్యి. నిన్నా మొసళ్ళకే అహారంగా



వేయబోతున్నాం,'' అంటూ మరుగుజ్జులు, సర్పనఖుణ్ణి నదీజలంలోకి లాక్కు పోయారు.

ఆ సమయంలో అక్కడికి మరుగుజ్జు రాణి తన రథం మీద వచ్చింది. గడె కొండా, అతడి అనుచరులూ చేతులు కట్టుకుని, తలలు వంచి రథం వెంట వున్నారు. రాణీని చూస్తూనే జయశీలుడు, '' మీ జాతి కలహాన్ని తన లాభంకోసం ఉపయోగించుకో చూసిన కృపాణజిత్తును మృత్యువృక్షం బలి తీసుకున్నది, అందరూ హాయిగా బతకండి. ఇక మా దారిన మేం పోతాం. పోయేముందు యీ మృత్యు వృక్షాన్ని అగ్నికి అహుతి చేయదలిచాం.



ఇది ఏమరుపాటున వున్న చాలామంది ప్రాణాలను పొట్టన పెట్టుకుని వుంటుంది," అన్నాడు.

"అయ్యా, అలాగే చేయండి. మీ సహాయానికి చాలా కృతజ్ఞులం. ఆ నరవానరం యజమాని అంతమయాడు కాని, ఆ భయంకర వానరం మాత్రం యింకా యీ అరణ్యాల్లోనే ఎక్కడో తిరుగుతున్నది. రాత్రింబవళ్లు మా జాగ్రత్తలో మేం వుండక. తప్పదు," అన్నది రాణి.

జయశీలుడు జాలిగా ఆమె కేసి చూసి, "జలాశ్వాల మీద వచ్చిన సర్పనఖుడనే వాడు మాకు దొరికాడు. వాడి తమ్ముణ్ణి ఆ నరవానరం ఎత్తుకుపోయింది. సర్పనఖుణ్ణుంచి మాకు సాయం అవసరం కనక, అతడి తమ్ముణ్ణి వెతికే ప్రయత్నంలో ఆ భయంకర వానరం మాకు తటస్థపడితే, దాన్ని తప్పక చంపి తీరుతాం," అన్నాడు.

"దాన్ని చంపటం కాదు, మచ్చిక చేసి నేను వాహనంగా వాడుకోబోతున్నాను. నిప్పెక్కడ? మృత్యువృక్షాన్ని కాల్చి బూడిద చెయ్యాలి," అంటూ సిద్ధసాధకుడు చుట్టూ కలయచూశాడు.

మరుగుజ్జుల్లో నలుగురైదుగురు భగభగ మండుతున్న కాగడాలతో ముందుకు వచ్చారు. సిద్ధసాధకుడు వాళ్ళల్లో ఒకడి చేతినుంచి కాగడా తీసుకుని, "ప్రాణులను తిని బతికేది గనక, యీ వృక్షంలో కొంత మాంస లక్షణాలూ, కొవ్వు లక్షణాలూ గల పదార్థం వుండకపోదు. దూరంగా వుండి యీ మండే కాగడాలు విసిరి చూద్దాం, ఏమవుతుందో!" అంటూ కాగడాను చెట్టు కొమ్మల మీదికి విసరబోయాడు. అంతలో వెనకనుంచి, "ఆగు! పాపీ, చిరంజీవి మృత్యువృక్షాన్నే బూడిద చేయదలిచావా? అది నీ వల్లనవునా?" అన్న కేక వినిపించింది.

సిద్ధసాధకుడూ, జయశీలుడూ తలలు తిప్పి ఆ కేక వేసినవాడెవడా అని చూశారు. మామూలు మరుగుజ్జు జాతివాడయినా,

వాళ్ళకన్న రెండు మూడంగుళాల పొడవు వున్న వాడొకడు, మెడలో పూసలూ, భుజాన గొడ్డలీ పెట్టుకుని—జుట్టు విర బోసుకుని, కుప్పిగంతులు వేస్తూ వచ్చి జయశీల, సాధకుల ముందు నిలబడ్డాడు.

సిద్ధసాధకుడు శూలంతో వాణ్ణి మృదువుగా తాకి చూసి, "ఎవడవురా నువ్వు? మహాకాళుడి భక్తుణ్ణయిన నన్నే, పాపీ అనగలిగిన సాహసం నీకెక్కణ్ణించి వచ్చింది?" అని అడిగాడు.

ఆ వచ్చినవాడు నిర్భయంగా సిద్ధ సాధకుడి ముఖంలోకి చూసి, తరవాత చేయి ఊపుతూ, "నేనే చిరంజీవి మృత్యువృక్షం పూజారిని. ఇంతకు ముందు మీరు వృక్షాన్ని కత్తితో కొట్టి నప్పుడు, అది పెద్దగా మూలగటం విన్నారుగదా?" అన్నాడు.

ఆ మాటలు వింటూనే జయశీలుడు, ఆ పొట్టి పూజారి కేసి అనుమానంగా చూసి, "చెట్టు వెనక వుండి అలా మూలిగింది నువ్వేకదా? నిజం చెప్పు," అని మెడ పట్టుకున్నాడు.

పొట్టి పూజారి ఏ మాత్రం తొణ కుండా, "అవును, అలా మూలిగింది నేనే! కాని మూలగమని శాసించినది వృక్షాన్ని ఆవహించివున్న మృత్యుదేవి. నేనామె పూజారిని, సేవకుణ్ణి," అన్నాడు.



జయశీలుడు, యిప్పుడు వీణ్ణి ఏంచేద్దాం అన్నట్టు సిద్ధసాధకుడి కేసి చూశాడు. సాధకుడు పొట్టి పూజారి భుజాన వున్న గొడ్డలిని తన చేతికి తీసుకుని, దాని పదునేపాటో పరీక్షించి చూసి, "ఒరే, జిత్తులమారి పొట్టి వెధవా! ఈ నాటితో మృత్యువృక్షానికి ఆయువు తీరిపోయినట్టే. దాని పూజారి వైన నీ ఉద్యోగం కూడా పోయింది. చేతిలో పదునైన గొడ్డలి వున్నది గనక, అరణ్యంలో ఎక్కడైనా కట్టెలు కొట్టుకుని బతుకు. అమాయక జీవుల ప్రాణాలు బలిగొనే మృత్యువృక్షం కాలి బొగ్గు కాబోతున్నది," అంటూ భగభగ మండు




తున్న కాగడాను చెట్టు కేసి విసరబోయేంతలో, పొట్టి పూజారి ఎగిరి అతడి చేయి పట్టుకున్నాడు.

"దుర్మార్గుడా, యీ మహాకాలుడి భక్తుణ్ణే తాకేంత దుస్సాహసం చేస్తావా?" అంటూ సిద్ధసాధకుడు పూజారిని విదిలించాడు.

పొట్టి పూజారి అంతదూరాన పోయి పడి లేచి, "అయ్యా, యీ మృత్యువృక్షం దుర్మార్గుల్నీ, మోసకారుల్నీ తప్ప ధర్మపరుల్ని చంపదు," అన్నాడు.

అప్పటివరకూ అంతా చూస్తూ మౌనంగా ఊరుకున్న జయశీలుడు చప్పున ముందుకు పోయి పొట్టి పూజారిని పట్టుకుని, "నువ్వు ధర్మపరుడివే గదా? ఎన్నడూ ఎలాంటి మోసాలూ చేసినవాడివి కాదు; అవునా?" అని అడిగాడు.

"అయ్యా, అందుకు సందేహమా?" అన్నాడు పొట్టి పూజారి.

పూజారి యిలా అనగానే జయశీలుడు అతణ్ణి పైకెత్తి, మృత్యువృక్షం కేసి విసిరి వేయబోయాడు. పూజారి ఒక చావు కేక పెట్టి, "అయ్యా, నన్ను వదలండి, భయంకర మరణంపాలు చేయకండి," అంటూ గడగడ వణికిపోసాగాడు.

జయశీలుడు నవ్వుతూ అతణ్ణి నేల మీదికి దించి, "సాధకా, యిక యిక్కడ మనం కాలం వృథాచెయ్యటం ఎందుకు? మృత్యువృక్షానికి నిప్పుపెట్టు," అన్నాడు.

సిద్ధసాధకుడు మరుగుజ్జుల చేతుల్లో నుంచి మండుతున్న కాగడాలు తీసుకుని వృక్షం బోదె కేసీ, కొమ్మల మీదికీ విసిరాడు. మరుక్షణం నూనెలో తడిపిన ఎండుకట్టెలా మృత్యువృక్షం ముట్టుకుని, పెద్ద మంటలతో, పొగలతో కాలిపోసాగింది.

జయశీలుడు చెట్టు కొమ్మల నుంచి వేళ్ళాడుతున్న కృపాణజిత్తు శవం కేసి చూసి, నిట్టూరుస్తూ, "వీడు అమరావతీ నగర రాజుగారి అశ్వదళనాయకుడు. ఒక జూదగృహంలో వీడికీ, నాకూ వచ్చిన

తగూ మూలంగానే, నే నిలా అరణ్యాల పాలు కావలసివచ్చింది. దుర్మార్గుడికి మంచి చావు దుర్లభం! అదే జూదశాలలో నా మిత్రుడైన దేవశర్మ అనే అతనుండే వాడు. అతనూ దేశాలు పట్టిపోయాడు. ఎక్కడ తిరుగుతున్నాడో ఏమో!'' అన్నాడు.

''మనం మాయాసరోవరాన్ని చేరి, హిరణ్యపురం రాజుగారి పిల్లల్ని బంధ విముక్తుల్ని చేసేలోపల, అతడూ మన కెక్కడో తటస్థపడకపోడు. తప్పిపోయిన వాళ్ళను మహానగరాల్లో వెతికి పట్టుకోవటం కన్న, అరణ్యాల్లో వెతికి పట్టటం తేలిక,'' అన్నాడు సిద్ధసాధకుడు.



''అవును, సాధకా! నీ మాటలు వింటూంటే, నాకూ నమ్మబుద్ధవుతున్నది. సర్పనఖుడెక్కడ?'' అంటూ జయశీలుడు చుట్టూ కలయచూశాడు.

సర్పనఖుడు ఒక జలాశ్వాన్ని ఎక్కి, దూరంగా వున్న కొండల కేసి చూస్తూ, ఏదో దీర్ఘంగా యోచిస్తున్నాడు. జయశీలుడు అక్కడ వున్న రెండవ జలాశ్వాన్ని సిద్ధసాధకుడికి చూపుతూ, ''సాధకా, ఈ అశ్వాన్ని వృథాగా యిక్కడ వదలటం ఎందుకు? మనలో ఎవరో ఒకరం ఉపయోగించుకోవచ్చుగదా?'' అన్నాడు.

''జయశీలా, ఆ జలాశ్వం నీదే. నేను కాలినడకన నిన్ను అనుసరించగలను. ఎప్పటికైనా ఆ భయంకర నరవానరం నా కంటబడితే, దాన్ని క్షణాలమీద మచ్చిక చేసి వాహనంగా చేసుకుంటాను,'' అన్నాడు సాధకుడు.

''సాధకా, నువ్వన్నంత పనీ చేయగలవు. సరే, యిక బయలుదేరదామా?'' అని జయశీలుడు అక్కడ వున్న రాణీ, గడెకొండలతోపాటు మిగతా మరుగుజ్జులందరినీ ఉద్దేశించి, ''మీ ప్రబలశత్రువైన కృపాణజిత్తు, అదుగో కాలిపోతున్న మృత్యువృక్షంతోపాటు బూడిద అయిపోతున్నాడు. ఇక మీకు వచ్చిన భయం ఏమీ లేదు, సుఖంగా జీవించండి. ఇక మా దారిన మేం పోతాం,'' అన్నాడు.

జయశీలుడు ముందు జలాశ్వం మీదా, కొంచెం వెనకగా సిద్ధసాధకుడూ బయలు దేరేసరికి, మరుగుజ్జుజాతి వాళ్ళందరూ, జయజయధ్వానాలు చేశారు. అది విన్న సర్పనఖుడు చప్పున తలతిప్పి, దూరంగా పోతున్న జయశీల, సిద్ధసాధకులను కేకవేసి పిలుస్తూ, "జయశీల, సిద్ధ సాధకులారా, కొంచెం ఆగండి! నా తమ్ముడి కోసం వెతకాలిగదా, నేనూ వస్తున్నాను," అంటూ తన అశ్వాన్ని వేగంగా వాళ్ళ దగ్గిరకు పరిగెత్తించాడు.

జయశీలుడు అతణ్ణి ఒకసారి పరీక్షగా చూసి, "నదీ స్నానం నీకు మేలు చేసినట్టున్నది, యిక నీ దారిన నువ్వు పోవచ్చు. మేం ఇద్దరం మాయాసరోవరం ఎక్కడ వున్నదో వెతికి తెలుసుకుని, దాని యజమానిని ముక్కలు ముక్కలుగా నరికి, నీటి పక్షులకూ, జంతువులకూ ఆహారంగా వేయబోతున్నాం," అన్నాడు.

ఆ మాటలకు సర్పనఖుడు ముఖం అయిష్టంగా పెట్టాడేతప్ప, జవాబేమీ యివ్వలేదు. తరవాత ముగ్గురూ ఒక అరగంట కాలం అరణ్యంలో ప్రయాణించి, లోగడ జయశీలుడూ, సిద్ధ సాధకుడూ జలపాతం నుంచి నదిలో పడిన ప్రాంతాన్ని చేరారు.

జయశీలుడు పూర్వం తమకు ఆ ప్రాంతాల కలిగిన అనుభవం గురించి సర్పనఖుడికి చెప్పబోయేంతలో, సర్ప నఖుడు చేయెత్తి కొంచెం దూరంలో వున్న కొండ గుహల్లో ఒకదాన్ని వాళ్ళకు చూపుతూ, "ఆ గుహలో నుంచి తొంగి చూస్తున్న భయంకర మృగం నరవానరం కాదా?" అన్నాడు.

"అవును, నరవానరమే!" అంటూ జయశీలుడు ఆశ్చర్యపోయేంతలో నర వానరం భయంకరంగా అరుస్తూ గుహ నుంచి బయిటికి దూకింది. ఆ మరు క్షణం పెద్దగా ఘీంకరిస్తూ, మకరకేతు వాహనమైన జలగ్రహం గుహ నుంచి వెలువడి, నరవానరాన్ని తొండంతో వడిసి పట్టుకున్నది. —(ఇంకావుంది)






# రెండు రూపాలు

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువు శ్రమపడుతున్నది ఏవైనా అపూర్వశక్తుల కోసం అయితే, వెనకటికి విశ్వశ్లోకుడి లాగా వాటిని అపాత్రుడికి ఇయ్యకు. అతని కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం విశ్వశ్లోకుడనే ఏకాకి బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనికి మంత్రవిద్యల మీద అమితమైన అసక్తి ఉండేది. వాటిని సాధించటానికి అతను సిద్ధులను వెతుక్కుంటూ కొండలూ, అరణ్యాలూ తిరిగాడు. చివరకు వింధ్య పర్వతాలలో అతనికి ఒక సిద్ధుడు తటస్థ

## బేతాళ కథలు



పడ్డాడు. విశ్వశ్లోకుడు ఆయనకు సేవలు చేసి, ఆయన నుంచి ఒకేసారి రెండు రూపాలు ధరించే విద్య సంపాదించాడు.

"దీనిని ఎవరికి చెబితే లోకానికి మేలు కలుగుతుందో అలాటివారికే చెప్పు," అని గురువు, ఆ విద్యను దుర్వినియోగం చేయనని విశ్వశ్లోకుడి చేత ప్రమాణం చేయించాడు.

విశ్వశ్లోకుడు తన గురువు వద్ద సెలవు పుచ్చుకుని, అనేక దేశాలు తిరిగి తన విద్యను ప్రదర్శిస్తూ చాలా కీర్తి ప్రతిష్ఠలు సంపాదించాడు.

అలా తిరుగుతూ అతను ఒకసారి కళింగదేశానికి వచ్చాడు. అక్కడి రాజు మహాదాత, అడిగినవారికి లేదనకుండా ఇచ్చేవాడు. ఆ రాజు విశ్వశ్లోకుణ్ణి తన రహస్య మందిరానికి తీసుకుపోయి, "మహాత్మా, మీ ద్విశరీరధారణ శక్తి అపూర్వమైనది. నేను ప్రజలను ఎలా పాలిస్తున్నానో మీరు వినే ఉంటారు. నాకు మీరు మీలాగా రెండు శరీరాలు ధరించే విద్య ప్రసాదించినట్టయితే నేను ప్రజలకు మరింత బాగా సేవ చేయగలుగుతాను," అన్నాడు.

ఈ మాట విని విశ్వశ్లోకుడు నిర్ఘాంత పోయాడు. అప్పటివరకూ రాజులు తన విద్య చూసి, మెచ్చుకుని, సత్కరించారే గాని, ఆ విద్యను తమకు చెప్పమని అడిగిన వారు లేరు. ఇకముందు తనకు ఈ సమస్య కూడా ఎదురుకావచ్చునని గ్రహించి అతను, "ఈ విషయం ఆలోచించవలసి ఉన్నది. నేను మీకు ఈ విద్య చెప్పదలచుకుంటే ఆరు నెలలకు మళ్ళీ వస్తాను," అని సెలవు తీసుకున్నాడు.

అటు తరవాత మరో రాజ్యంలో రాజకుమార్తె, విశ్వశ్లోకుడి ప్రదర్శన చూసిన అనంతరం అతనితో, "మహానుభావా, మీరు నా తండ్రిలాటివారు కనక నన్ను సతమతం చేస్తున్న సమస్య మీతో చెప్పుకుంటున్నాను. నా అందం చూసి

మా ఇరుగు పొరుగు యువరాజు లిద్దరు నన్ను పెళ్ళాడగోరుతున్నారు. ఎవరికి నన్నిచ్చి పెళ్లిచేసినా రెండోవారు ఆగ్రహించి, మా రాజ్యం మీదికి దండెత్తి సర్వనాశనం చేస్తారు. ఇద్దరూ మా కన్న బలవంతులే. రెండు శరీరాలు ధరించే విద్య నాకు మీరు నేర్పినట్టయితే నా సమస్య పరిష్కారమైపోయి, జన నష్టం తప్పుతుంది,'' అన్నది.

''ఆరు నెలల తరవాత ఏ సంగతీ చెబుతాను,'' అని విశ్వశ్లోకుడు అక్కడి నుంచి బయలుదేరాడు.



కాశ్మీరదేశంలో అతనికి ఒక రాజ వైద్యుడు తటస్థపడి, ''రాజకుటుంబం చాలా పెద్దది. అందరికీ నేనే స్వయంగా వైద్యం చెయ్యాలి. నాకు రెండు కాళ్ళూ, రెండు చేతులూ చాలటం లేదు. తమరు అనుగ్రహించి నాకు రెండు శరీరాలు ధరించే విద్య చెప్పారంటే చాలా తెరిపిన పడిపోతాను,'' అన్నాడు.

విశ్వశ్లోకుడు మిగిలినవారిని కోరినట్టే రాజవైద్యుణ్ణి కూడా ఆరునెలలు గడువు అడిగాడు.

తరవాత కొంతకాలానికి అతను చేర రాజ్యం వెళ్ళటం తటస్థించింది. అక్కడి ప్రజల జీవితం సుఖంగా లేదు. వారికి బందిపోటు బాధ ఎక్కువగా ఉన్నది. గంగోత్రి అనేవాడు గజదొంగ. వాడంటే ప్రజలకు సింహస్వప్నం. రాజు వాడి చర్యలు అరికట్టటానికి విశ్వప్రయత్నాలు చేసి విఫలుడయాడు.

చేరరాజు విశ్వశ్లోకుడి ప్రదర్శన చూసిన మీదట, తన ప్రజలు కూడా చూడాలని బహిరంగ ప్రదర్శన ఏర్పాటు చేయించాడు. ఒకే మనిషి ఒకే కాలంలో రెండు రూపాలలో కనిపించి, ఇద్దరు వ్యక్తులలాగా ప్రవర్తించటం చూసి ప్రజలు అద్భుతం చెందారు.

ఆ రాత్రి విశ్వశ్లోకుడి విడిదికి గజదొంగ గంగోత్రి వచ్చి, ''నేనెవరో తెలుసునా? గంగోత్రిని. నీ ప్రదర్శనం చూశాను.



కొట్టాలి. ఆ పని నా ఒక్కడివల్లా కాదు, నాలాటివాడు మరొకడు తోడు ఉండాలి. ఖజానా కొల్లగొట్టినాక జీవితమంతా హాయిగా గడపగలను," అన్నాడు గంగోత్రి.

"అయితే నువు కొల్లగొట్టినదానిలో నాకు నాలుగో వంతు ఇచ్చుకోవాలి. ఇంకో విషయం, నీ రెండు శరీరాలలో దేనికి ఆపద కలిగినా రెండోది కూడా ఆ ఆపదకు గురి అవుతుంది. నా అనుమతి లేకుండా ఈ విద్య ఎవరికీ చెప్పరాదు. ఈ మంత్రం అసత్యమాడేవాడికి పని చెయ్యదు. సమ్మతమేనా?" అన్నాడు విశ్వశ్లోకుడు.

"రేపు రాత్రికి నాకు మంత్రం పనిచేస్తే చాలు. ఆ తరవాత నాకు దానితో పని లేదు," అన్నాడు గంగోత్రి.

విశ్వశ్లోకుడు గజదొంగకు శాస్త్రోక్తంగా మంత్రం చెప్పి పంపించి, రాజు వద్దకు వెళ్ళి, గంగోత్రి ఖజానా కొల్లగొట్టే ప్రయత్నం గురించి చెప్పి, రాజసత్కారం పొంది, తన దారిన తాను వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, విశ్వశ్లోకుడు కళింగరాజుకూ, రాజ వైద్యుడికీ, రాజకుమార్తెకూ చెప్ప నిరాకరించిన మంత్రాన్ని బందిపోటు దొంగకు ఎందుకు చెప్పాడు? లేకపోతే తన ప్రాణానికి ప్రమాదమనుకున్నాడా? లేక

రెండు శరీరాలుగా విడిపోయే విద్య నాకు నేర్పు. లేకపోతే నిన్ను చిత్రవధ చేస్తాను," అన్నాడు.

విశ్వశ్లోకుడు చిరునవ్వు నవ్వి, "అది ఒక్కటే చాలా? మిగతా మంత్రాలు కూడా కావాలా?" అని అడిగాడు.

"మిగతావి నాకెందుకు? అది ఒక్కటీ చాలు," అన్నాడు గంగోత్రి.

"సరే, చెబుతాను. కాని ఈ విద్య నేర్చుకోదలచుకుంటే, దీన్ని ఎందుకు ఉపయోగిస్తావో చెప్పాలి," అన్నాడు విశ్వశ్లోకుడు.

"చిల్లర దొంగతనాలతో విసిగి పోయాను. కొడితే రాజుగారి ఖజానా

ఖజానా దోపిడీలో వాటాకు ఆశపడ్డాడా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోతే నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "విశ్వశ్లోకుడు ధనాశగలవాడైతే రాజుకూ, రాజవైద్యుడికీ, రాజకుమార్తెకూ తన విద్య ఉపదేశించే వాడే. అదీగాక, అతను గంగోత్రి దొంగ తనంలో వాటా కోసం ఆగక, అతని రహస్యం ముందుగానే చేరరాజుకు చెప్పేశాడు. ప్రాణభయం సమస్య కూడా లేదు, అతను తన విద్యతో తప్పించుకో గలడు. అసలు విషయం ఏమంటే, లోకోపకారం జరిగే పరిస్థితిలోనే ఆ విద్యను ఎవరికైనా ఇయ్యమని సిద్ధుడు చెప్పాడు. ఒక్క దొంగకు ఆ విద్య చెప్పటంలో లోకోపకారం ఉన్నది. ఎలాగంటే, అబద్ధమాడటానికి లేదు గనక, వాడు ఖజానా కొల్లగొట్టటానికి వస్తాడు. రాజుగారికి ముందుగా విశ్వ శ్లోకుడు దొంగ గురించి చెప్పి ఉన్నాడు గనక వాడికి ప్రమాదం ఉన్నది. ఏ శరీ ర్యానికి ప్రమాదం కలిగినా రెంటికీ ప్రమాదమే గనక గంగోత్రి ఆట కట్టయి పోతుంది. చేరప్రజలు సుఖపడిపోతారు. ఈ లోకోపకారం ఆ విద్యను కళింగ రాజుకుగాని, రాజవైద్యుడికిగాని, రాజ కుమార్తెకుగాని ఇయ్యటంవల్ల సాధ్యం కాదు. మరొక విశేషమేమంటే విశ్వ శ్లోకుడు గంగోత్రిని రెండు శరీరాలు విడిపోయే మంత్రం చాలా అని అడిగాడు. అవి తిరిగి ఒకటి అయే మంత్రాన్ని దొంగ అడగలేదు. దొంగతనంలో వాటా అడగటంలో కూడా ఒక ఉద్దేశం ఉన్నది. ఏ కారణంచేతనైనా ఖజానా దొంగతనం నిర్విఘ్నంగా సాగితే, తనకు వాటా ఇయ్యటానికి వచ్చినప్పుడు గంగోత్రిని విశ్వశ్లోకుడు రాజభటులకు పట్టియ్య గలుగుతాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# కాపు—కరణం

ఒక గ్రామంలో కరణానికి పెద్ద మొక్కజొన్నతోట ఉండేది. దానికి కాపు ఉండటానికి పాపయ్య అనేవాణ్ణి నెల జీతం మీద పెట్టుకున్నాడు. పాపయ్య ఎంతో విశ్వాసంగా తోటకు కాపలా కాశాడు.

ఒకనాడు కరణంగారు అడగగా పాపయ్య ఒక బుట్టెడు కండెలు కోసి తీసుకుపోయి ఇచ్చాడు. "పాపం, వాడికి నాలుగు కండెలియ్యండి," అన్నది కరణంగారి భార్య.

"అంత పెద్దతోటకు కాపున్నవాడు నాలుగు కండెలు కోసుకోకుండా ఉంటాడా?" అన్నాడు కరణం. ఈ మాట విని పాపయ్య బిక్కచచ్చిపోయి, పట్నంలో ఉండే తన బంధువైన కొత్వాలుకు కరణం అన్నమాట అందజేశాడు.

కరణంగారు ఆ యేడు శిస్తులు వసూలుచేసి జమకట్టి పద్దామనుకుంటుండగా, రక్షకభటులు వచ్చి, రాజుగారి దగ్గిరికి రమ్మన్నారు.

"ఎందుకు రమ్మన్నారు? నే నెంతో విశ్వాసంగా పని చేస్తున్నానే!" అని కరణం లబలబ లాడాడు.

"అంత పెద్ద మొక్కజొన్న తోటకు కాపున్నవాడు నాలుగు కండెలు కోసుకోడా? ఇంత డబ్బు వసూలు చేస్తూ కొంత మింగకుండా ఉన్నారా?" అన్నారు భటులు.

అదంతా నాటకమని తెలిసిందిగాని, అది మొదలు కరణం పనివాళ్ళపట్ల ఉదారంగా ఉంటూ వచ్చాడు.

—మారుపాక మంజురాణి.





అచల గ్రామ నివాసి అయిన రఘునాథుడు వయసు మళ్లినవాడు. భార్య లేదు. ఆయనకున్నదల్లా గుణి అనే మనవడు — చనిపోయిన కూతురి కొడుకు. ఆయనకు గుణి అంటే ప్రాణమేగాని, వాడి ధోరణి ఏమీ ఇష్టంలేదు. ఎందుకంటే రఘునాథుడు చేసే తాకట్టు వడ్డీ వ్యాపారం గుణికి చాలా అసహ్యం. గ్రామస్థుల అవసరాలకు భారీ వడ్డీ మీద అప్పులిచ్చి రఘునాథుడు అంతులేని డబ్బు సంపాదించాడుగాని, తాను కటిక దరిద్రుడల్లే జీవిస్తూ, గుణిని కూడా అలాగే ఉండేట్టు చేశాడు.

ఇల్లు ఒకపక్కనుంచి శిథిలమవుతూంటే, "కనీసం ఇల్లయినా బాగు చేయించరాదా, తాతా?" అని గుణి అంటే, "డబ్బేదిరా?" అన్నాడు రఘునాథుడు.

ఇనప్పెట్టె నిండా తళతళా మెరిసే బంగారు నాణాలూ, వెండి నాణాలూ ఉన్నాయని గుణికి తెలుసు. కాని రఘునాథుడు ఖర్చుపెట్టడు.

గుణి ఊళ్ళో ఉన్నంతవరకూ చదివి, తరవాత సమీపంలో ఉన్న పట్టణంలో హైస్కూలు చదువు పూర్తిచేశాడు. "ఇంక నీకు చదువు చాలు, వడ్డీ వ్యాపారం నువు చూడు. నేను పెద్దవాణ్ణవుతున్నాను," అన్నాడు రఘు.

"తాతా, ఆ పాపిష్ఠి వ్యాపారం నాకు వద్దు," అన్నాడు గుణి.

"ఇది అనాదిగా వస్తున్న పవిత్రమైన వ్యాపారం. పాపిష్ఠిదంటావేం?" అన్నాడు రఘునాథ్.

"తీరని అవసరం ఉండి జనం నీ దగ్గిర అప్పుకోసం వస్తారు. నువు డబ్బిస్తావు. మంచిదే. కాని వాళ్ళ దగ్గిర

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు




దారుణంగా వడ్డీ రాబట్టుతావు. అదే పాపం! పాతరోజులు పోయాయి. ఈ కాలంలో శ్రమించకుండా డబ్బు సంపాదించరాదు. అసలు ఈ డబ్బంతా ఏం చేస్తావు?'' అని గుణి అడిగాడు.

"నీ కోసమేరా, అడ్డగాడిదా," అన్నాడు రఘునాథ్ కోపంగా.

''పాపిష్ఠిది! నీ డబ్బంతా పాపిష్ఠిది! అది డబ్బు కాదు, ఊళ్ళోవాళ్ళ కన్నీరు. ఆ డబ్బు నాకు పనికిరాడు. అది పాపిష్ఠిది. కావలిస్తే రుజువు చెయ్యగలను,'' అన్నాడు గుణి.

''రుజువు చేస్తావా? పెద్ద పెద్ద మాటలే నేర్చావురా! నిన్ను చదువుకోనియ్యటం పొరపాటయిపోయింది,'' అన్నాడు రఘునాథ్.

గుణి నవ్వి, ''జరిగిపోయినదానికి చింతించి ఏం లాభం? నీ డబ్బు పాపిష్ఠిదని ప్రత్యక్షంగా రుజువు చేస్తానంటూంటిని గదా! నిజంగా అది లోకుల కన్నీరే!'' అన్నాడు.

రఘునాథుడి మనసులో సంకోచం ప్రవేశించింది.

''అలా అని నిజంగా రుజువు చేస్తావా? ఏదీ రుజువు చెయ్యి, చూస్తాను,'' అన్నాడాయన.

''కాని, ఒక్క షరతు, తాతా! ఊళ్లో నిరుద్యోగులైన యువకులు చాలామంది ఉన్నారు. వాళ్ళు సహకార వ్యవసాయ క్షేత్రం నడపాలనుకుంటున్నారు. వాళ్లకు కావలసిన పెట్టుబడి డబ్బు నువు ఇయ్యాలి,'' అన్నాడు గుణి.

''అదేమీ కుదరదు,'' అన్నాడు రఘునాథుడు.

''సరే, అయితే నీ ఇనప్పెట్టెలో డబ్బంతా ఏడ్చి, ఏడ్చి నీరు కారిపోతుంది. ఇప్పటికే ఏడుస్తున్నది నీ డబ్బు. కావాలంటే ఒక నాణెం తీసుకురా, చూపిస్తాను.'' అన్నాడు గుణి.

రఘునాథుడు బెదిరిపోయి, గబగబా వెళ్ళి, ఇనప్పెట్టెనుంచి ఒక నాణెం తెచ్చి,

''ఇది ఏడవటం లేదు. ఎందుకురా నన్ను అనవసరంగా భయపెడతావు?'' అన్నాడు.

''నేను భయపెట్టటం లేదు, తాతా. ఈ డబ్బు ఏడవటం మొదలుపెట్టింది, చూడు!'' అంటూ గుణి ఆ నాణాన్ని తన ఎడమ చేతిలోకి తీసుకుని, చిన్నగా నొక్కాడు. నాణెం నుంచి నీటి బొట్లు రాలాయి.

"జయదేవుడా! డబ్బు ఏడుస్తున్నది!" అంటూ రఘు స్పృహ తప్పి, కుప్పకూలి పోయాడు.

గుణి ఆయన పడిపోకుండా పట్టుకుని పడుకోబెట్టి, ముఖాన చన్నీళ్ళు చల్లి, విసనకర్రతో విసిరి, త్వరలోనే స్పృహ తెప్పించాడు. స్పృహ తెలియగానే రఘునాథ్, ''ఆ డబ్బు ఇంకా ఏడుస్తూనే ఉందిరా?'' అని అడిగాడు.

''ప్రస్తుతం మానేసింది, తాతా! కాని డబ్బును ఇనప్పెట్టెలోనే బంధించి ఉంచితే, అది తప్పక ఏడుస్తుంది. అది బయటికి రావాలి. లోకుల కంటి నీరు ఇప్పుడు లోకులకు ఉపకరించాలి. అందుచేత నీ డబ్బులో కొంత భాగం ఊళ్ళో ఉన్న నిరుద్యోగి యువకులకు ఇయ్యి. వాళ్లు తమ జీవితసమస్యలు పరిష్కరించుకుంటారు," అన్నాడు గుణి.

''వాళ్ళు పెట్టే సహకార క్షేత్రంలో నీకు కూడా వాటా ఉంటే అలాగే ఇస్తాను,'' అన్నాడు రఘునాథుడు.



గుణి తాత పాదధూళి నెత్తిన రాచుకుని, "ఆ సహకార క్షేత్రానికి నేనే నిర్వాహకుణ్ణి, తాతా! నిరుద్యోగి యువకులకు, నేనంటే ఎంతో నమ్మకం," అన్నాడు.

రఘునాథుడు చప్పున పోయి, ఇనప్పెట్టె తెరిచి, "ఎంత కావాలో తీసుకో," అన్నాడు.

గుణి ఇనప్పెట్టె నుంచి కొంత డబ్బు తీసుకుని, పెట్టె మూసి, తాళపు చెవులు తాత కిచ్చాడు.

త్వరలోనే గ్రామంలో సహకార క్షేత్రం వెలిసింది. అందులో వరి సాగుబడితో బాటు, పాల కేంద్రమూ, కోళ్ళ కేంద్రమూ కూడా ఏర్పడ్డాయి. అందులో చేరిన యువకులు, గుణితో సహా, కష్టపడి పనిచేసి, ఏడాదిలోగా మంచి లాభం గడించారు. అది చూసి, పొరుగూళ్ళ యువకులు చాలామంది వచ్చి సహకార క్షేత్రంలో కలిశారు. రెండేళ్ళకల్లా అది ఆదర్శ వ్యవసాయ క్షేత్రమై, గ్రామానికి ఎంతో జీవం తెచ్చింది.

క్రమంగా వ్యవసాయ క్షేత్రం తన మూలధనాన్ని తాను సంపాదించుకున్నది. గుణి కొంత డబ్బు తీసుకుని తన తాత వద్దకు వెళ్ళి, "తాతా, ఇదుగో నేను నీ వద్ద తీసుకున్న డబ్బు. వడ్డీ ఎంత ఇయ్యమన్నావు?" అన్నాడు.

"నేను నీకు అప్పు పెట్టానురా? నాకు మొదలూ వద్దు. వడ్డీ వద్దు. అది ఊళ్ళోవాళ్ళు నాకు వడ్డీ కింద ఇచ్చినది. వాళ్ళ పిల్లల ఉపయోగం కోసం తిరిగి ఇచ్చాను. నేనా డబ్బు తాకను," అన్నాడు రఘునాథుడు.

ఆయన మనసు అలా ఎలా మార్చగలిగావని గుణిని మిత్రులు అడిగారు. అతను డబ్బు ఏడవటం గురించి చెప్పాడు. ఆ ఇంద్రజాలం ఎలా చేశావని అడిగారు.

"దూది తడిపి, చెవి వెనక పెట్టుకున్నాను. మా తాత గమనించకుండా దాన్ని తీసి, నాణెం వెనక ఉంచి నొక్కాను. నాణెం కన్నీరు కార్చింది!" అన్నాడు గుణి నవ్వుతూ.





# దేవుడులాంటి అల్లుడు

ఒక ఊళ్ళో ఇద్దరు అన్నదమ్ములు ఉండేవారు. అన్న పేదవాడు. తమ్ముడు మాత్రం వ్యాపారాలలో అక్రమాలూ, అన్యాయాలూ చేసి, బోలెడంత డబ్బు వెనక వేశాడు. ఇద్దరికీ పెళ్ళీడు వచ్చిన కూతుళ్ళున్నారు. తమ్ముడు బోలెడు కట్నం ఇచ్చి తన కూతురికి పెళ్లి చెయ్యగలడుగాని, అన్న తన కూతురికి పెళ్లి చెయ్యలేడు.

అన్న తమ్ముడి స్వభావం తెలిసి, అతని ముందు చెయ్యి చాచలేదు. అన్న నిరుపేద అని తెలిసివుండి కూడా తమ్ముడు అన్నకు ఏ ఆర్థిక సహాయమూ చెయ్యలేదు.

తమ్ముడి కూతురికి పట్నంలో ఒక మంచి సంబంధం తటస్థపడింది. మహేశుడు అనే యువకుడు మంచి ఉద్యోగం చేస్తున్నాడు. మహేశుడూ, అతని తండ్రీ తమ్ముడి ఆహ్వానం మీద పెళ్లి చూపులకు వచ్చారు.

తమ్ముడి భార్య తమ ఇంట ఏ అక్కర వచ్చినా, తన బావగారి కూతురు వల్లిని వంటపనికి పిలిపించుకుంటూ ఉండేది. ఈ సారి కూడా ఆమె వల్లిని పిలిచి, తాను తన కూతురి ముస్తాబులో లీనమై పోయింది.

పెళ్లివారికి వల్లి చేసిన ఫలహారాలు పెట్టి, వాళ్లు మెచ్చుకుంటే, అవన్నీ తమ పిల్లే చేసిందని తమ్ముడూ, అతని భార్యా చెప్పారు.

పెళ్లికూతురి అందం సహజమైనది కాదు, పూర్తిగా కృత్రిమమైనది, ఖరీదయిన సొమ్ములతోనూ, పట్టు చీరలతోనూ వచ్చినది. పిల్లను చూసి పెళ్లివారు, ఏ సంగతీ తరవాత కబురు చేస్తామని వెళ్లిపోయారు.

ఎం. కామేశ్వరరావు

వాళ్ళు వెళ్ళాక పళ్ళాలు లోపలికి తీసుకుపోవడానికి వచ్చిన వల్లి, బల్ల మీద పుస్తకం చూసి, "అరె, పెళ్లి కొడుకు, దీన్నిక్కడ మరిచిపోయి నట్టున్నాడు," అంటూ దాన్ని చేతిలోకి తీసుకున్నది.

"అలా నోరు వెళ్ళబెట్టుకు నిలుచోక పోతే వేగం వెళ్లి, అతడికి ఇచ్చి రాకూడదూ ?" అని తమ్ముడి భార్య చిరాకుపడింది.

వల్లి గబగబా బయటికి వెళ్లి, పెళ్ళి వారిని కలుసుకుని, "మీరు పుస్తకాన్ని బల్ల మీదపెట్టి మర్చిపోయారు. ఇదుగో, తీసుకోండి," అంటూ పుస్తకాన్ని మహేశుడి కిచ్చింది.

మహేశుడు ఆమె వైపు ఆశ్చర్యంగా చూశాడు. ఆమె చవుకపారు బట్టలే కట్టుకున్నా, ఆమె సహజ సౌందర్యం కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నది.

"నా పేరు వల్లి. పెళ్లికూతురు మా బాబాయి కూతురు. ఈ హడావుడిలో వంట సహాయం చెయ్యటానికి వచ్చాను," అని తలవంచుకుని చెప్పి, వల్లి అక్కణ్ణించి వచ్చేసింది.

నాలుగు రోజుల అనంతరం వల్లిని పెళ్లి చేసుకుంటానంటూ మహేశుడు కబురు చేశాడు. అతను కట్నం కానీ కూడా కోరలేదు.

ఈ వార్త వినగానే తమ్ముడికీ, అతని భార్యకీ మూర్ఛ వచ్చినంత పని అయింది.



తీరి కూర్చుని, పుస్తకం ఇచ్చి రమ్మని వల్లిని పంపినందుకు ప్రగాఢంగా పశ్చాత్తాపపడింది తమ్ముడి భార్య.

అన్నకీ, అతని భార్యకీ ఆనందం ఇంతా, అంతా కాదు.

పెళ్ళి రెండు రోజుల్లోకి వచ్చింది. తమ్ముడు తన భార్యతో, ''మనం పెళ్లికి వెళ్ళవద్దు. వెళితే మన తాహతుకు తగినట్టు పెళ్లి కానుక ఇయ్యాలి. మనకి గిట్టుబాటు కాదు,'' అన్నాడు.

''రెట్టింపు గిట్టుబాటవుతుంది! నా మనసులో గొప్ప ఆలోచన ఉన్నది. చూస్తూ ఉండు!'' అన్నది భార్య.

అన్న తన భార్యతో, ''తమ్ముడు పెళ్ళికి వస్తాడు. వాడి భార్యకు వాళ్ళ తాహతుకు తగిన చీరపెట్టు. నేను ఎక్కడయినా కొంత అప్పు చేసి తెస్తాను,'' అన్నాడు.

పెళ్ళిలో తమ్ముడు పెళ్ళికూతురిపేర ఒక వెండి అరిటాకు చదివించాడు. అన్న భార్య తమ్ముడి భార్యకు మంచి పట్టు చీర పెట్టింది.

అయినా తమ్ముడి భార్యకు తృప్తి కలగలేదు. పెళ్ళి పూర్తి అయాక నలుగురూ చూస్తూండగా, ఆమె వెనక్కు విరుచుకుపడి, జుట్టుముడి ఊడదీసుకుని, లేచి నిలబడి, ''నా సంగతి పూర్తిగా మర్చిపోయి, పిల్ల పెళ్ళిచేసుకుంటావురా, అన్నయ్యా? ఈ ఇంటి ఆడబడుచును, నాకు ఇప్పుడే ఖరీదైన పట్టుచీరపెట్టు.''



అని కేకలుపెడుతూ, నానాహంగామా చేసింది.

ఈ అన్నదమ్ములకు ఒక చెల్లెలుండేది. ఆ పిల్ల పదేళ్ళు బతికి చనిపోయింది. ఇప్పుడు తమ్ముడి భార్య ఆ పిల్ల తనని పూనినట్టు నటిస్తోంది.

పెళ్ళి పందిట్లో అంతా గజగజలాడి పోతూ, తలా ఒక రంగా మాట్లాడసాగారు. అన్న అమాయకుడు. ఆ చెల్లెలంటే అతనికి చాలా ప్రేమ. "నిన్ను ఏనాటికీ మర్చిపోనమ్మా. ఇప్పుడే మంచి చీరకొని తెస్తాను," అంటూ డబ్బు కోసం ఇంట్లోకి వెళ్ళాడు.

ఇంతలో పెళ్ళి పందిట్లో మరోవిడ్డూరం జరిగింది. అప్పటిదాకా మామూలుగా కూర్చుని ఉన్న పెళ్ళికొడుకు, ఆ పక్కనే ఉన్న అరటిపిలకను భుజానికెత్తుకుని, భీకరంగా అరుస్తూ, అటూ, ఇటూ తిరగ సాగాడు.

"ఇంకేముంది? పెళ్ళికొడుక్కు హనుమంతుడు పూనాడు. ఇక గాలీ, ధూళీ ఈ ప్రాంతంలో ఉండటానికి వీల్లేదు," అన్నారు అందరూ.

ఈ మాట వింటూనే తమ్ముడి భార్య రహస్యంగా పళ్ళుకొరుక్కుంటూ, విధిలేక వెనక్కు విరుచుకుపడి, మామూలు మనిషి అయింది. వెంటనే పెళ్లికొడుకు పూనకం కూడా దిగిపోయింది.

పెళ్ళి అయిన మర్నాడు అన్న మహేశుణ్ణి, "నాయనా, నీకు అప్పుడప్పుడూ దేవుడు పూనుతాడా?" అని అడిగాడు.

మహేశుడు నవ్వి, "నన్ను దేవుడూ పూనలేదు. ఆమెను దయ్యమూ పూనలేదు. దయ్యమే అనుకుంటే, పదేళ్ళపిల్ల చీర కోరుకుంటుందండీ? ఆవిడ దుర్బుద్ధి గ్రహించి, నావంతు నాటకం నేను ఆడాను," అన్నాడు.

దేవుడు పూనే అల్లుడు దొరికినందుకు అందరూ అభినందిస్తూంటే, "అవును, మా అల్లుడు దేవుడులాంటి వాడే!" అనే వారు అన్నా, అతని భార్యా.



# సత్సాంగత్యం

ఒకనాడు నారదుడు విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి, సత్సాంగత్యం వల్ల కలిగే లాభం ఏమిటని అడిగాడు. "దండకారణ్యంలో ఒక క్రిమి ఇప్పుడే పుట్టింది. దాన్ని అడుగు," అన్నాడు విష్ణువు.

నారదుడు దండకారణ్యానికి వెళ్ళి, క్రిమిని గుర్తించి, విష్ణువును అడిగిన ప్రశ్నే దాన్ని అడిగాడు. ఆ క్రిమి తల ఎత్తి నారదుడి కేసి ఒక్కసారి చూసి, ప్రాణం విడిచింది.

నారదుడు కంగారుపడి, విష్ణుమూర్తి దగ్గిరికి వెళ్ళి జరిగినది చెప్పి, తన అనుమానం తీరలేదన్నాడు.

"ఫరవాలేదు. ఫలాని ఊళ్ళో ఫలాని బ్రాహ్మడి ఆవు దూడను ఈనింది. నీ అనుమానం దానికి చెప్పు," అన్నాడు విష్ణువు.

నారదుడు అలాగే వెళ్ళి, దూడను గుర్తించి, విష్ణువును అడిగిన ప్రశ్నే దాన్ని కూడా అడిగాడు. ఆవుదూడ తల ఎత్తి నారదుడి కేసి రెండు క్షణాలపాటు చూసి, చచ్చిపడిపోయింది.

నారదుడు మళ్ళీ విష్ణువు వద్దకు వెళ్ళి జరిగినది చెప్పి, తన అనుమానం తీరలేదన్నాడు.

"దక్షిణ దేశంలో చోళరాజుకు ఇప్పుడే ఒక కొడుకు పుట్టాడు. వాణ్ణి వెళ్ళి అడుగు," అన్నాడు విష్ణువు.

నారదుడు చోళరాజు కొడుకును కలుసుకుని భయపడుతూనే తన ప్రశ్న అడిగాడు.

"స్వామీ, నేను క్రిమిగా ఉండి తమ వంటి సత్పురుషుడి దర్శనమాత్రం చేత ఆవు దూడగా పుట్టాను. తిరిగి తమ దర్శనం లభించి, ఇలా రాజకుమారుడుగా పుట్టాను. సత్సాంగత్యం గురించి ఇంతకన్న ఏం చెప్పను?" అన్నాడు రాజుకొడుకు.

—ఎం. ఆర్. కె. నాయర్.





# గుర్తింపు

కర్పూరదేశాన్ని ఏలే వసంతరాయలుకు తనను తన ప్రజలంతా ఒక గొప్ప ప్రభువుగా గుర్తించాలనీ, తాను పురాణ పురుషులలాగా ఆచంద్రతారార్కం కీర్తి సంపాదించాలనీ ఆశ ఉండేది. కీర్తి కాంక్షతో ఆయన ఎన్నో ధర్మకార్యాలూ, ప్రజాసౌకర్యాలూ చేశాడు. తననుగురించి ప్రజలు ఏమనుకుంటున్నారో తెలుసుకోవటానికి ఆయన మారువేషంలో దేశసంచారం చేస్తూండేవాడు. ఎక్కడికి వెళ్ళినా ప్రజలు తనను ప్రశంసిస్తూడటం విని ఆయనకు చాలా ఆనందంగా ఉండేది.

అయితే ఒక గ్రామంలో రామయ్య అనేవాడు వసంతరాయలు పట్ల అమితమైన నిర్లక్ష్యం ప్రకటించే సరికి రాజుకు ఎదురు దెబ్బ తగిలినట్టయింది.

"ఏం గొప్పలేద్దూ? ఆ రాజు మా వూరికి ఏం చేశాడు?" అన్నాడు రామయ్య.

వసంతరాయలు మనసు చివుక్కుమన్నది. ఆయన వెంటనే ఆ గ్రామం అవసరాలను పరిశీలించి, గ్రామప్రజలకు సరి అయిన నీటి సదుపాయంలేదని తెలుసుకున్నాడు. గ్రామానికంతకూ ఒకే ఒక చెరువు ఉన్నది. వానలు సరిగా లేకపోతే అది నిండదు.

వసంతరాయలు రాజధానికి తిరిగి వెళ్ళి మంత్రులతో సంప్రతించి, ఆ గ్రామం మీదుగా వెళ్ళేలాగా ఒక కాలవ తవ్వించాడు. కాలవతవ్వకం పూర్తికాగానే గ్రామప్రజల నీటి సమస్య తీరిపోయింది.

వసంతరాయలు మారువేషంలో మళ్ళీ రామయ్యను కలుసుకున్నాడు. ఈ సారి రామయ్య తనను పొగడుతాడనుకున్నాడు కాని రామయ్య, "కాలవ తవ్విస్తే సరిపోయిందా? మాకున్నది నీటి ఇబ్బంది ఒకటేనా?" అన్నాడు.

"వసుంధర"

వసంతరాయలు ఆ గ్రామ పరిస్థితిని జాగ్రత్తగా పరిశీలించి, రాకపోకల నిమిత్తం ఆ గ్రామానికి సరిఅయిన బాట లేదని తెలుసుకుని, బాట వేయించాడు. గ్రామాన్ని రహదారితో కలిపేబాట ఏర్పడింది.

అప్పటికీ రామయ్య రాజు పట్ల అసంతృప్తే ప్రకటించాడు. రాజు, రామయ్య ధర్మమా అంటూ, ఆ గ్రామానికి మంచి పాఠశాలా, ఉచితవైద్యశాలా మొదలైన సదుపాయాలు కలిగించాడు. గ్రామానికి పట్టణం లక్షణాలు ఏర్పడ్డాయి.

ఇన్ని సౌకర్యాలు ఏర్పడ్డాక గ్రామస్థులు రాజును తెగపొగడుతున్నారు, కాని రామయ్య పొగడటం లేదు.

చివరకు వసంతరాయలు విసిగిపోయి, "ఏమిటి, రామయ్యా? ఊరు ఊరంతా రాజును ఆకాశాని కెత్తుతుంటే నువు మెచ్చుకోవేం? నీదేదో వింత తత్వంగా వున్నదే!" అని అన్నాడు.

"రాజు చేసిన పనులవల్ల వాళ్ళు బాగుపడ్డారు కాబట్టి పొగడుతారు. నే నెందుకు ఆయన్ని పొగడాలి?" అన్నాడు రామయ్య చిరాకుగా.

"రాజు చేసిన పనులకు ఊళ్ళో అందరూ బాగుపడి, నువు ఒక్కడివి మాత్రమే బాగుపడలేక పోయావా?" అని వసంతరాయలు అడిగాడు.

"అంతే మరి! కాలవ వల్ల భూము లున్నవాళ్ళు బాగుపడ్డారు. నాకు భూమి



లేదు. బాటవేయించటం వల్ల వర్తకులు బాగుపడ్డారు. నా కేం లాభం? పాఠశాల పెట్టించారు. చదువుకునే వయసు పిల్లలు లేరు నాకు. ఉచిత వైద్యశాల వచ్చింది. నే నెప్పుడూ చిర్రున చీది ఎరగను. బస్తీలలోలాగా ఎన్నోరకాల వినోదాలు గ్రామంలో ఏర్పడ్డాయి. అవి చూసి ఆనందించటానికి నాకు డబ్బెక్కడిది?" అన్నాడు రామయ్య.

ఈసారి రాజు రామయ్య పరిస్థితి తెలుసుకున్నాడు. ముసలివాడయాక రామయ్యను ఆయన పిల్లలు సరిగా చూడటం మానేశారు. రాజు రామయ్యకు ఒక చిన్న ఇల్లు కట్టించి పెట్టి, అతడికి రోజులు హాయిగా గడవటానికి డబ్బు కూడా ఏర్పాటు చేశాడు.

ఆ తరవాత కలిసినప్పుడు రామయ్య రాజును తెగపొగిడాడు.

వసంతరాయలు మారువేషంలో దేశ సంచారం చేస్తూండగా ఇంకో గ్రామంలో ఇంకో సోమయ్య తగిలి, "ఏం గొప్ప లేద్దూ? రాజు మా వూరికి ఏం చేశాడు గనక?" అన్నాడు.

ఈసారి రాజు ఊరిపరిస్థితి గురించి గాక, సోమయ్య పరిస్థితి గురించి తెలుసుకుని, అతని సుఖజీవనానికి తగిన ఏర్పాట్లు చేశాడు. ఈసారి సోమయ్య రాజును పొగడాడు.

వసంతరాయలుకు కనువిప్పయింది. ఎన్నో గొప్ప పనులు చేసిన వాణ్ణి ఎవరూ గుర్తించరు. తమకు ప్రత్యేకంగా ఉపయోగ పడితేనే గుర్తిస్తారు. దేశంలో ప్రతి ఒక్కడిచేతా గుర్తింపు పొందాలంటే, ప్రతి ఒక్కరికీ ప్రయోజనకరంగా ఉండే పనులు చేయాలి తాను. అది సాధ్యం కాదు. అందుచేత గుర్తింపుకోసం కాక, పదిమందికీ పనికివచ్చే పనులు మాత్రమే చెయ్యాలి. వసంతరాయలు అలాగే చేశాడు. ఆయన కాలంలో ఆయనను అందరూ గుర్తించకపోయినా కర్పూర వసంతరాయలు పేరు మాత్రం చిర స్థాయిగా నిలిచి ఉన్నది.



# అక్కరకు రాని విద్య

బాలాజీ అనేవాడు ఒంటరిగా కొంతకాలం దొంగతనాలు చేసి, తన శక్తులు ఉడిగి పోతున్నాయని తోచగానే ఏదో ఒక పట్టణం పోయి, అక్కడ మర్యాదస్తుడుగా జీవించసాగాడు. ఎవరైనా తోడు ఉంటే ఇంకా దొంగతనాలు చెయ్యగలడు గాని, తోడు దొంగ ఉండటం అపాయం. అందుకని అతను తోడు కోసం ప్రయత్నించలేదు.

ఇంతలో ఒకనాడు బాలాజీ ఇంటి ముందు అవరణలో దొమ్మరి ఆటలు జరిగాయి. అందరిలోకి ఒక కుర్రాడు బాలాజీకి నచ్చాడు. ఎత్తునుంచి దూకటంలోగాని, మొగ్గలు వెయ్యటంలోగాని వాడి లాఘవం చాలా గొప్పది. కుర్రాడు కూడా అందంగా ఉన్నాడు.

బాలాజీ వాడికి తన కూతురినిచ్చి పెళ్ళిచేస్తే, తాను మళ్ళీ నాలుగు కాలాలపాటు దొంగతనం కొనసాగించవచ్చుననుకున్నాడు. కుర్రాడు పెళ్ళికీ, మామ ఇంట ఉండిపోవటానికీ ఒప్పుకున్నాడు.

ఒకనాటి రాత్రి బాలాజీ తన అల్లుణ్ణి వెంటబెట్టుకుని ఒక సంపన్నుల ఇంటికి వెళ్ళి, "ఈ ప్రహరీ గోడ దూకి, తల వాకిలి తలుపు తెరు!" అన్నాడు.

"అలా దూకటం సాధ్యమా, మామా? దొమ్మరి గడలు నాటాలి! మా నాన్న డప్పు వాయించాలి! పొలికేకలూ, ఈలలూ వినపడాలి! ఏమీ లేకుండా నేను గోడ దూకటం అసంభవం!" అన్నాడు అల్లుడు.

—యస్. మున్నీ బేగం.






ఒక జమీందారుకు ముగ్గురు కొడుకులు. ముగ్గురికీ పెళ్ళిళ్ళు అయి, భార్యలు కాపరాని కొచ్చారు. జమీందారు పరమ లోభి, కొడుకుల చేతికి డబ్బు అంద నియ్యడు. అందుచేత వాళ్ళు ధనార్జనకు వేరు వేరు వ్యాపకాలు చూసుకున్నారు. కొడుకులు వేరు కాపరాలు పెట్టటం వంశగౌరవానికి విరుద్ధం అని జమీందారు ఉద్దేశం. అందుచేత అంతా కలిసే ఉంటున్నారు.

జమీందారు తన ఆరోగ్యం కోసం ప్రకృతి వైద్యం చేసుకునేవాడు. ఆయన ప్రతిరోజూ కాలవకు స్నానానికి వెళ్ళి, ఒళ్ళంతా ఒండ్రుమట్టి పట్టించి, ఝాము సేపు అయాక స్నానం చేసి, ఇంటికి తిరిగి వచ్చేవాడు.

జమీందారుకు ఉన్న డబ్బంతా ఒక ప్రత్యేకమైన గదిలో, ఒకపెట్టెలో ఉండేది. వాటి తాళపు చెవులు జమిందారు బొడ్డునే ఉండేవి. స్నానానికి వెళ్ళేటప్పుడు ఆయన వాటిని తన రెండో కొడుక్కి దాచమని ఇచ్చేవాడు. మిగిలిన ఇద్దరు కొడుకుల మీదా ఆయనకు అంత నమ్మకంలేదు.

ఒకరోజు ఆయన స్నానానికి బయలుదేరే సమయానికి ఒక్క కొడుకూ ఇంట్లో లేడు. కోడళ్ళలో చిన్నదానికి తన మీద భయభక్తులున్నాయని కొంత కాలంగా నమ్మకం కుదిరి ఉండడం వల్ల ఆయన తాళపు చెవులను చిన్న కోడలు కిచ్చి, తాను స్నానం చేసి తిరిగి వచ్చేదాకా దాచి ఉంచమన్నాడు.

అయితే కొద్ది దూరం వెళ్లాక చిన్న కోడలి మీద అంత నమ్మకం ఉంచడం మంచిది కాదని తోచి, జమీందారు వెనక్కు వచ్చి, చిన్న కోడలిని ఒక

ఎమ్. వి. వి. సత్యనారాయణ

కంట కనిపెట్టి ఉండమని పెద్ద కోడలికి రహస్యంగా చెప్పి, మళ్ళీ బయలుదేరాడు. ఇద్దరు కోడళ్ళూ తోడు దొంగలుగా వ్యవహరిస్తారేమోనని అనుమానం కలిగి, ఆయన మరోసారి వచ్చి, రెండో కోడలిని మిగిలిని ఇద్దరి మీదా నిఘా ఉండమని రహస్యంగా హెచ్చరించి, నిశ్చింతగా స్నానానికి వెళ్ళిపోయాడు.

తాళపు చెవులు చేతికి వచ్చిన క్షణం నుంచీ చిన్న కోడలికి ఆ గది తెరవాలని తహతహ పట్టుకున్నది. కాని ఆమె గది కేసి ఎప్పుడు వెళ్ళినా, పెద్ద కోడలు ఆ ప్రాంతాలనే తారట్లాడుతూ కనిపించింది. రెండో కోడలు ఇద్దరినీ కనిపెట్టుతున్నట్టు స్పష్టమయింది.

ముగ్గురూ ఒకరినొకరు ప్రశ్నించుకోవటంలో మామగారు వేసిన ఎత్తు కాస్తా బయటపడింది. ముగ్గురూ ఏకమై, గది తాళం తీసి, పెట్టె తెరిచి, అందులో నుంచి తమకు కావలసిన సొమ్ము తీసుకుని, మళ్ళీ పెట్టెనూ, గదినీ ఎప్పటిలాగా మూశారు.

వాళ్ళ ఇంటికి సమీపంలోనే ఒక బట్టల వర్తకుడున్నాడు. ముగ్గురూ అతని వద్దకు వెళ్ళి, మూడు చీరలు కొని, వాటిని కట్టుకుని, మామగారు స్నానం ముగించి ఇంటికి వచ్చేసరికి, ఆడుతూ, పాడుతూ తమ పనులు చేసుకుంటున్నారు.

ముగ్గురు కోడళ్ళూ కొత్త చీరలు కట్టుకుని కనిపించేసరికి జమీందారు గుండె



గుబగుబలాడింది. ఐనా పైకి ఆత్రం కని పించ నీయకుంటా ఆయన తన రెండో కోడలిని, ''ఎక్కడివమ్మా చీరలూ?'' అని అడిగాడు.

ఆమె తాళపు చెవులు మామగారికి తిరిగి ఇస్తూ, ''మీరు అలా వెళ్ళగానే ఒక జ్యోతిష్కుడు మన ఇంటికి వచ్చి, నాకు దగ్గిరలో ఒక సిరి ఉన్నదనీ, అది త్వరలోనే నా సొంత మవుతుందనీ, చెప్పి వెళ్ళిపోయాడు. అతడు అలా వెళ్ళగానే, తెలిసిన బట్టల వర్తకు డొకడు వచ్చి, మా ముగ్గురినీ మెచ్చుకుని, మూడు చీరలిచ్చి, కట్టుకోమని బలవంతం చేశాడు. మేం చీరల ధర అడిగితే, 'మీ మామగారి వంశగౌరవం నాకు తెలీదా? నేను చచ్చి స్వర్గానికిపోయినా, ఆయన వెనక్కి పిలిచి ఇస్తారుగాని, బాకీ ఉంచు కోరు!' అన్నాడు. ఇంతలో మీ గది తలుపు లను లోపలినుంచి ఎవరో గట్టిగా తట్టారు. గజ్జెల చప్పుడు కూడా వినిపించింది. 'అమ్మా ధనలక్ష్మి తలుపు తట్టి, బాకీ తీర్చమంటున్నది!' అన్నాడు బట్టల వర్తకుడు. మా ముగ్గురికీ భయంవేసి, కలిసికట్టుగా వెళ్ళి, గదితలుపు తెరిచాం. కంకణాలుగల చెయ్యి తలుపుల సందు నుంచి మాకు డబ్బు అందించింది. బాకీ తీర్చేశాం,'' అన్నది.

ఆ సమయానికి ముగ్గురు కొడుకులూ ఇంటికి తిరిగి వచ్చారు. జమీందారు మండిపోతూ, ''ఏడీ, ఆ బట్టల వర్తకుడు?'' అన్నాడు.

"మన వంశగౌరవాన్ని కీర్తిస్తూ డబ్బు తీసుకుని అప్పుడే వెళ్ళిపోయాడు,'' అన్నది పెద్దకోడలు.

జమీందారు మాట్లాడలేదు. కోడళ్ళను మందలిస్తే కొడుకులకు కోపం వచ్చి, వేరే కాపరాలు పెట్టవచ్చు. వంశగౌరవం అప్రతిష్ఠ పాలవుతుంది!

ముగ్గురు కొడుకులూ తెల్లవారుతూనే కూడబలుక్కుని ఇల్లు వదిలి బయటికి వెళ్ళినట్టు జమీందారు కలలో కూడా ఊహించలేదు.






కీర్తిపురం అనే గ్రామంలో సుందరాచార్యులు అనే వైద్యుడు ఉండేవాడు. నిజానికి అతను వైద్యుడు కాడు. ఒక గొప్ప వైద్యుడికొడుకు. అతని తండ్రి అథర్వణాచార్యులు అద్భుతమైన చికిత్సలు చెయ్యటమేగాక, ఎన్నో రసాయనాలూ, భస్మాలూ, ఆసవారిష్టాలూ చేసి ఇంటి నిండా ఉంచాడు. ఆ తండ్రి కొడుకుగదా, అవే మందులు గదా అని ఊళ్ళోవాళ్ళు సుందరాచార్యులు వద్దకు చికిత్సకోసం వచ్చేవారు.

ఇలా ఉండగా రామచంద్రు డనే యువకుడు వైద్యవిద్యలో బాగా శిక్షణ పొంది, ఎక్కడ స్థిరపడదామా అని గ్రామాల వెంట తిరుగుతూ కీర్తిపురం చేరి, అక్కడే ఉండి పోదామనుకున్నాడు.

ఒక రోజు గ్రామాధికారి కుమార్తె ప్రసవించి, సూతికాజ్వరంతో బాధపడుతూంటే, సుందరాచార్యులను పిలుచుకు వచ్చారు. అతను నాడి చూసి, మందు ఇచ్చాడు. రోగికి ఆ మోతాదు వేసి, సుందరాచార్యులుతో ఆమె తండ్రి మాట్లాడుతుండగానే ఆమెకు ఒళ్ళంతా చెమటలు పోసి, చల్లబడి పోయింది.

ఇది చూస్తున్న గ్రామనౌకరు ఒక్క పరుగునపోయి రామచంద్రుడిని తీసుకు వచ్చాడు. రామచంద్రుడు విషయం తెలుసుకుని, రోగినాడి పరీక్షించి, తన సంచి కట్టునుంచి ఒక కుప్పెతీసి, తేనెతో అరగదీసి, రోగి నాలుక మీద రాచాడు. కొద్ది క్షణాలలో ఆమె కళ్ళు తెరిచింది.

అది మొదలు రామచంద్రుడే ఆ గ్రామానికి అసలైన వైద్యుడుగా చలామణీ అయాడు. అతని మీద సుందరాచార్యులుకు అసూయా, ద్వేషమూ పెరిగాయి. అతని మీద ప్రతీకారానికి మార్గ

బాలనాగు సీతాదేవి

మేమిటా అని తన మిత్రుడైన ఒక కరటకాచార్యులను సలహా అడిగాడు.

తన మిత్రుడి సలహాప్రకారం సుందరాచార్యులు సుబ్బయ్య అనేవాడికి డబ్బు ఆశచూపి, వాడు ఏం చెయ్యాలో చెప్పాడు. ఆ సుబ్బయ్య మరో ఇద్దరిని వెంట బెట్టుకుని, తిన్నగా రామచంద్రుడి ఇంటికి వెళ్ళాడు. ఆ సమయాన రామచంద్రుడితో గ్రామాధికారి, ఏదో మాట్లాడుతున్నాడు. సుబ్బయ్య రామచంద్రుణ్ణి కడుపు నొప్పికి మందు అడిగాడు. రామచంద్రుడు సుబ్బయ్యను పరీక్షించి, పొట్టలో ఉబ్బరింపు లేదనీ, కడుపు నొప్పికి కారణం అజీర్ణం అయి ఉంటుందనీ, అతనికి కొద్దిగా లవణభాస్కర చూర్ణాన్ని ఇచ్చాడు.

సుబ్బయ్య ఆ చూర్ణాన్ని మింగి, విరుచుకుపడ్డాడు. వెంటవచ్చిన వాళ్ళు, "బాబో, సుబ్బయ్యను చంపేశారు!" అని అరవటం మొదలుపెట్టారు.

రామచంద్రుడు సుబ్బయ్య నాడి చూసి వాడు నాటకం ఆడుతున్నాడని గ్రహించి, దానికి తగిన శాస్తి చేయాలని, "అయ్యా, ఇది చాలా ప్రమాదకరమైన కడుపునొప్పి. దీనికి ఘాటైనవిషం తప్ప మరొక మందు లేదు. ఇదుగో దీన్ని సుబ్బయ్య గొంతులో పొయ్యగానే కడుపునొప్పి ఉంటే తగ్గి, లేచి కూర్చుంటాడు. లేకపోతే అతని ప్రాణానికి నేను పూచీ కాదు. ఎందుకంటే, మందు వెయ్యకపోయినా చచ్చిపోతాడు," అని గ్రామాధికారితో అన్నాడు.

అతను లోపలికి పోయి ఒక గ్లాసులో ఏదో తెచ్చి, "సుబ్బయ్య నోరు తెరిచి పట్టుకోండిరా!" అని సుబ్బయ్య వెంట వచ్చిన వాళ్ళతో అన్నాడు.

"బాబో, రక్షించండి!" అంటూ సుబ్బయ్య లేచి కూర్చున్నాడు.

సుందరాచార్యులు కుట్ర సుబ్బయ్య నోటనే గ్రామాధికారి దగ్గిరనుంచీ అందరూ విన్నారు. సుందరాచార్యులు ఊరు వదిలి పారిపోయాడు. అథర్వణాచార్యులుగారి మందులు రామచంద్రుడికీ, ఊళ్ళో ప్రజలకూ ఉపయోగపడ్డాయి.





పూర్వం చంపావతీ నగరంలో పర్వత మల్లు అనే మల్లయోధుడు యువకులకు మల్లవిద్యలో శిక్షణ ఇస్తూండేవాడు. ఆయన శిష్యులలో మెరికలలాటి వాళ్ళు భార్గవుడూ, శూరవర్మా అనేవాళ్లు.

ఒకనాడు దీర్ఘనాభుడు అనేవాడు వచ్చి పర్వతమల్లుతో, "మల్లూ, నీకు తెలిసిన ఏవో నాలుగు పట్లు నేర్పినంత మాత్రాన నీ శిష్యులు గొప్ప మల్లయోధులవుతారా? ఏదీ, నీ శిష్యుణ్ణి ఎవడినైనా నన్ను జయించమను!" అన్నాడు.

ఈ మాటలు వింటున్న భార్గవుడు ఒళ్లుమండి, దీర్ఘనాభుణ్ణి నడుము పట్టుకుని గిరగిరా తిప్పి, కింద పడవేశాడు. దీర్ఘనాభుడికి నడుము విరిగినంత పని అయింది. అతను లేచి, గొణుక్కుంటూ దుమ్ము దులుపుకుని వెళ్లిపోయాడు. మల్లుల జీవితంలో ఇలాటి అల్ప సంఘటనలు ఎన్నో ఉంటాయి గనక దీన్ని గురించి ఎవరూ పట్టించుకోలేదు.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. భార్గవుడూ, శూరవర్మా తమ అభ్యాసం పూర్తి చేసి, బ్రతుకు తెరువు కోసం దేశం మీద పడ్డారు. వాళ్లు మగధదేశంలో పర్యటిస్తూ ఒక విషయం తెలుసుకున్నారు. అదేమంటే, మగధరాజు దగ్గిర ఆస్థాన మల్లుడు ఉన్నాడు. కాని, అది శాశ్వతమైన ఉద్యోగం కాదు. ఆ మల్లుణ్ణి ఓడించిన వారికి ఆ పదవి లభిస్తుంది. భార్గవుడూ, శూరవర్మా కూడా ఆ పదవికి పోటీ చేయదలచారు. అయితే అది ఎవరు గెలిస్తే వారికే లభిస్తుంది. రెండోవాడికి అవకాశం ఉండదు. ఆ అవకాశాన్ని శూరవర్మ భార్గవుడికి ఇచ్చాడు.

భార్గవుడికి, ఆస్థానమల్లుడికి పోటీ ఏర్పాటయింది. ఇద్దరిమధ్యా ద్వంద్వ

తంజావూరు రాజేంద్రప్రసాద్



యుద్ధం చాలాసేపు జరిగింది. తన ఆస్థాన మల్లుడితో అంతసేపు పోరాడిన వారు ఎవరూ లేరు. అందుచేత రాజు భార్గవుడి శక్తి చూసి చాలా ఆశ్చర్యపడ్డాడు. నిజానికి, భార్గవుడు తన గురువైన పర్వత మల్లుడి వద్ద నేర్చిన పట్లన్నీ ప్రయోగించాడు. అయితే ఆస్థానమల్లు ఉద్దండుడు. అతను అన్ని పట్లకూ ప్రతిక్రియలు చెయ్యటమేకాక, చిట్టచివరకు భార్గవుడి చేత మన్ను కరిపించాడు. అదే ఓటమి చెందటానికి గుర్తు.

శూరవర్మ మరసటి రోజున ఆస్థాన మల్లుడితో పోరాడటానికి ఏర్పాటు చేసుకుని, ఆ రోజుకు భార్గవుడితో కలిసి వెళ్ళిపోయాడు. మర్నాడు ఆస్థానమల్లు గోదాలోకి దిగి చేతులు కలుపుతూండగానే శూరవర్మ అమాంతం ఆస్థానమల్లుని తన చేతిమీద గాలిలోకి ఎత్తి, పది అడుగుల దూరం గోదా బయటికి విసిరి వేశాడు. ఆస్థాన మల్లుడు మన్ను కరిచాడు. ఇంక పోరాటానికి అవకాశం లేకపోయింది. శూరవర్మకు ఆస్థానమల్లు పదవి లభించింది.

భార్గవుడు శూరవర్మ చూపిన యుక్తికి ఆశ్చర్యపోయి, "వర్మా, మన గురువుగారు నాకు తెలియని విద్యలు కొన్ని నీకు తెలిపినట్టు స్పష్టమయింది. నువు ఆస్థానమల్లును ఓడించిన పట్టు నాకు గురువుగారు చెప్పనేలేదు. ఆయనలో పక్షపాతం ఉన్నదనుకోలేదు!" అన్నాడు.

శూరవర్మ అతన్ని మందలిస్తూ, "భార్గవా, ఇది నాకు మన గురువుగారు చెప్పిన కిటుకు కాదు. దీన్ని నేను మరొక వస్తాదు నుంచి నేర్చుకున్నాను," అని, తనకు ఆ పట్టు తెలిపిన వస్తాదు ఉండే చోటు కూడా చెప్పాడు.

శూరవర్మ మాటలు భార్గవుడు నమ్మక, నిజం తెలుసుకోవటానికి ఆ వస్తాదు ఉండే పట్టణానికి వెళ్ళాడు.

ఆ వస్తాదు భార్గవుడు చెప్పినదంతా విని, "ఆ పట్టు నేను సృష్టించినది

కాదు. ఇక్కడికి సమీపంలో ఉన్న ప్రతిష్ఠానపురంలో ఒక కసాయివాడికీ, నాకూ పోటీ జరిగింది. వాడు నన్ను ఈ పట్టుతో పడగొట్టాడు. ఆ పట్టును నేను అభ్యాసం చేసి, నీ మిత్రుడికి నేర్పాను,'' అన్నాడు.

భార్గవుడు ప్రతిష్ఠానపురం చేరి, వస్తాదు చెప్పిన గుర్తుల ప్రకారం కసాయివాడి దుకాణం తెలుసుకుని, అక్కడ మాంసం విక్రయిస్తున్న దీర్ఘనాభుణ్ణి చూసి నిర్ఘాంత పోయాడు.

దీర్ఘనాభుడు కూడా భార్గవుణ్ణి చూసి ఆశ్చర్యపడి, అతని రాకకు కారణం అడిగాడు. భార్గవుడు జరిగినదంతా చెప్పి, తన సందేహం అడిగాడు.

దీర్ఘనాభుడు అంతా విని పొట్ట చెక్కలయ్యేలా నవ్వుతూ, ''అది నువు నా మీద ప్రయోగించిన పట్టే గదయ్యా? నేను మీ గురువుగారి వద్ద సవాలు చేసినప్పుడు నువు నన్ను అమాంతం ఎత్తి కొట్టావు చూడూ! ఆ పట్టు నాకు చాలా నచ్చింది. దాన్ని నేను ఒక మంచి పట్టుగా తయారు చేశాను,'' అన్నాడు.

''నేను ఆస్థానమల్లుడితో అంతసేపు పోరాడాను గాని, నాలాటివాడే అయిన శూరవర్మ ఒక్క క్షణంలో అతన్ని ఎలా ఓడించాడు? అది నాకు అర్థం కాలేదు,'' అన్నాడు భార్గవుడు.

''అందులో విచిత్రమేమున్నదీ? నిజమైన మల్లయోధుడు చేసే పని అదే. మొదట నిన్ను సంపి శూరవర్మ శత్రువు బలాబలాలూ, ఒడుపూ, నైపుణ్యమూ అంచనా వేసుకున్నాడు. మీ గురువు నేర్పిన పట్లు ఏవీ ఆస్థానమల్లుడి మీద పారవని తెలిసిపోయింది. అందుకే అతను అవతలివాడికి అవకాశమియ్యక, మొదటి దెబ్బతోనే పడగొట్టి మన్ను కరిపించాడు,'' అన్నాడు దీర్ఘనాభుడు.

ఎలా చూసినా శూరవర్మ తనకన్న తెలివిగలవాడేనని భార్గవుడు గ్రహించి, అతను ఆస్థానమల్లు పదవి సంపాదించి నందుకు సంతోషించాడు.





# పట్టుకుంటే పదివేలు

ఒక రాజధానిలో భీమన్న అనె గజదొంగ ఉండేవాడు. రాజు వాణ్ణి పట్టుకోవటానికి విశ్వప్రయత్నాలు చేసి, సాధ్యంకాక, వాణ్ణి పట్టిచ్చిన వారికి పదివేల వరహాలు బహుమానం ప్రకటించాడు. కాని దాన్ని గెలుచుకున్న వాళ్ళు లేకపోయారు.

ఒకసారి భీమన్న ఒక ధనవంతుడి ఇంటికి దొంగతనానికి వెళ్ళాడు. వాడు పై అంతస్థుకు వెళ్ళగానే ఇంటినౌకర్లు చూసి, "దొంగ," అని కేకలు పెట్టుతూ అన్ని వైపులనుంచీ పట్టుకోవటానికి వచ్చారు. భీమన్న దూరంగా ఉన్న మామిడిచెట్టు మీదికి దూకి, పక్క ఇంటి ఆవరణలో అదృశ్యమయాడు. నౌకర్లు వాణ్ణి పట్టలేమని నిరాశ చేసుకున్నారు.

నిజానికి భీమన్న చెట్టు మీది నుంచి పట్టు తప్పి, కిందపడి, గట్టిదెబ్బ తిని, లేవలేకపోయాడు. వాడు పడిన ఆవరణ రామశాస్త్రి, అనే వైద్యుడిది. భీమన్న దేకు(కు)ంటూ వెళ్ళి, చావడిలో మందులు తయారుచేస్తున్న రామశాస్త్రిని వైద్యం చెయ్యమని కోరాడు. రామశాస్త్రి భీమన్న గాయాన్ని పరిశీలించి లోపలికి వెళ్ళాడు.

లాంతరు తీసుకుని దొడ్డి గుమ్మాన బయటికి పోతున్న రామశాస్త్రిని చూసి, "ఎక్కడికండీ?" అని భార్య అడిగింది.

రామశాస్త్రి గొంతు తగ్గించి, "మన అదృష్టం పండిందే. ఆ వచ్చినవాడు భీమన్న. వాణ్ణి రాజభటులకు పట్టిచ్చామంటే మహారాజు పదివేల వరహాలిస్తాడు," అని చెప్పి వెళ్ళిపోయాడు.

లోపలికి వెళ్ళిన రామశాస్త్రి ఎంత సేపటికీ రాకపోయేసరికి భీమన్నకు అనుమానం వేసి, "ఎక్కడికి పోయాడు నీ మొగుడు ?" అని రామశాస్త్రి పెళ్లాన్ని గద్దించి, కత్తి చూపి భయపెట్టాడు.

చెల్లూరి సీతారాజేశ్వరరావు

దాంతో రామశాస్త్రి పెళ్ళాం నిజం చెప్పేసింది. భీమన్న ఆవేశపడి లాభం లేదని గ్రహించి, ''నన్ను అప్పగిస్తే మహారాజు పదివేల వరహాలిస్తాడు. నన్ను కాపాడితే లక్షవరహాలిస్తాను. నన్ను ఎక్కడైనా దాచు,'' అన్నాడు.

రామశాస్త్రి భార్యకు ఆశపుట్టింది. ఆమె భీమన్నను ధాన్యపు గాదెలో దాచి, భర్త రాజభటులతో రాగానే, ''వాడు నన్ను కొట్టి పారిపోయాడండీ,'' అని శోకాలు పెట్టింది.

రాజభటులు వెళ్ళగానే భీమన్న బయటికి వచ్చాడు. వాణ్ణి చూసి రామశాస్త్రి ఉలిక్కిపడ్డాడు. భార్య అతనితో అంతా చెప్పింది. రామశాస్త్రి భీమన్న గాయాలకు మందు రాస్తూ, ''మాకు డబ్బు ఎలా అందుతుంది? నీతో రావటం ప్రమాదం కదా!'' అన్నాడు.

భీమన్న ఒక బిళ్ళ తీసి ఇచ్చి, ''ఇది నా వాళ్ళకు చూపించు. వాళ్ళు నీకు లక్షవరహాలు ఇస్తారు. నువు డబ్బు తీసుకుని తిరిగివచ్చాకనే నన్ను వదిలిపెట్టు,'' అంటూ ఎక్కడికి వెళ్లాలో, ఎలా వెళ్లాలో రామశాస్త్రికి చెప్పాడు.

రామశాస్త్రి తృప్తిపడి దొంగల స్థావరానికి వెళ్ళాడు. అతనికి లక్ష వరహాలూ అందాయి. అయితే దొంగలు అతనికి



తెలియకుండా అతని వెనకగా వచ్చి, రామశాస్త్రి ఇల్లు చేరగానే అతన్ని బంధించి, తమ నాయకుణ్ణి విడిపించారు. భీమన్న లక్ష వరహాలు తిరిగి తీసుకోవటమేగాక, రామశాస్త్రి చిన్న కొడుకును లాక్కుపోతూ, ''పదివేల వరహాలిచ్చి నీ కొడుకును విడిపించుకో,'' అన్నాడు.

రామశాస్త్రి ఘొల్లుమన్నాడు. ఆయన తన దురవస్థను తన వద్ద వైద్యం నేర్చుకుంటున్న శంభుతో చెప్పుకున్నాడు. శంభు ధైర్యశాలి. శంభు రామశాస్త్రికి ఒక ఉపాయం చెప్పాడు. రెండు రోజుల అనంతరం భీమన్న వచ్చి రామశాస్త్రిని, ''ఏం చేశావు?'' అని అడిగాడు.

''ఇంతకుముందే కదయ్యా ఇచ్చాను. నువు మళ్ళీ పదివేలు తీసుకుని పాడుబడ్డ శివాలయం దగ్గిరికి రమ్మంటివి. ఇలా గయితే ఎలా చచ్చేది ?'' అని రామశాస్త్రి ఏడుస్తూ అన్నాడు.

''నేను రావడమేమిటి ? అబద్ధం !'' అని భీమన్న గర్జించాడు.

''అలాగంటే ఏం చెప్పను. రేపు అర్ధరాత్రి రమ్మని మరీ మరీ చెప్పావు.... ఒకవేళ నీ అనుచరుడెవడైనా నీ వేషంలో వచ్చాడా ?'' అన్నాడు రామశాస్త్రి.

భీమన్నకూడా అనుమానం వేసింది; ''రేపు అర్ధరాత్రి నేను అక్కడికి వచ్చి గమనిస్తాను. అబద్ధమని తేలితే నిన్ను చంపేస్తాను,'' అన్నాడు.

మర్నాడు అర్ధరాత్రి రామశాస్త్రి శివాలయం దగ్గిర కూర్చుని ఉన్నాడు. ఇంతలో ఒక ముసుగు వ్యక్తి వచ్చి, ''డబ్బు తెచ్చావా ?'' అని అడిగాడు.

''నిన్న నువు వెళ్ళాక, నేనే అసలు భీమన్నను అంటూ మరొకడు వచ్చాడు. అసలు భీమన్న ఎవరో తెలిస్తేగాని డబ్బు ఇయ్యను,'' అన్నాడు రామశాస్త్రి.

''నేనే అసలు భీమన్నను,'' అంటూ ముసుగు వ్యక్తి రామశాస్త్రి నుంచి డబ్బు సంచీ లాక్కున్నాడు.

ఇదంతా మాటున ఉండి చూస్తున్న భీమన్న ముసుగు వ్యక్తి మీద పడ్డాడు. ముసుగు వ్యక్తి సిద్ధంగానే ఉండి, భీమన్నను గట్టిగా పట్టుకున్నాడు. వెంటనే రామశాస్త్రి భీమన్నను తాళ్లతో బంధించాడు.

శంభు ముసుగు తొలగించి, ''దొంగ చిక్కాడండీ !'' అన్నాడు.

ఇద్దరూ కలిసి భీమన్నను రాజభటులకు అప్పగించారు. భీమన్న దొరకగాగే అతడి అనుచరులూ దొరికారు. రామశాస్త్రి కొడుకు ఇంటికి వచ్చేశాడు. రామశాస్త్రికి పదివేల వరహాలు బహుమానం లభించింది. ''ఇది న్యాయంగా నీదే !'' అన్నాడు రామశాస్త్రి శంభుతో.

''గురుదక్షిణ కింద మీరే తీసుకోండి,'' అన్నాడు శంభు.





# మాంత్రికుడి రామచిలుక

కౌశికపురాన్ని ఏలే వీరసేన మహారాజు పట్టమహిషి అయిన శచీదేవిది, లక్ష వరహాలు ఖరీదు చేసే వజ్రాల హారం పోయింది. అంతఃపురంలో యాభైమందికి పైగా నౌకర్లున్నారు.

రాజుగారు అంతఃపురంలోని నౌకర్లందరినీ పిలిచి, ''మీలో ఎవరో హారం తీశారు. దాన్ని తెచ్చి నాకు ఇచ్చినట్టయితే నేను శిక్షించబోను,'' అన్నాడు.

వారం రోజులు గడిచినా ఎవరూ వచ్చి, ,పోయిన హారాన్ని రాజుగారికి అర్పించలేదు. దొంగ దొరకలేదు.

ఒక రోజు రాజు కొలువులో ఉండగా ఎవరో సాధువు రాజదర్శనం కోసం వచ్చాడు. ఆ సాధువు వెంట ఒక చిలుక ఉన్నది.

''మహారాజా, నేను మాంత్రికుణ్ణి. రాణీగారి వజ్రాలహారం పోయిందట. నా మంత్రశక్తితో ఈ చిలుక చేత వజ్రాల హారం దొంగిలించిన మనిషి పేరు చెప్పించ గలను,'' అన్నాడు సాధువు.

ఈ మాట వినగానే సభలో అమిత మైన చైతన్యం కలిగింది. రాజు అందరినీ నిశ్శబ్దంగా ఉండమని, సాధువుతో, ''దొంగను తెలుసుకునే ముందు మీ మంత్రశక్తి చూపించి మమ్మల్ని ఆనందింపజేయండి,'' అన్నాడు.

సాధువు చిలుకను రాజుగారికి ఇచ్చి, ''మహారాజా, చిలుకను మీరు ఏమడుగు తారో అడగండి. తక్షణం జవాబులు యివ్వగలదు,'' అన్నాడు.

''మా అంతఃపురంలో ఎంతమంది సేవకులున్నారు ?'' అని రాజు చిలుకను అడిగాడు.

''ఏభైముగ్గురు,'' అన్నది మాంత్రికుడి చిలుక.

సుబ్రహ్మణ్యం అవంత్స

"వారిలో కొందరి పేర్లు చెప్పగలవా?" అని రాజు మళ్ళీ అడిగాడు.

చిలుక తడువుకో కుండా కొన్ని పేర్లు చెప్పింది.

వెంటనే సభలో ఆశ్చర్యధ్వానాలు చెలరేగాయి.

రాజు సభను ఉద్దేశించి, "ఇప్పటి కైనా హారాన్ని దొంగిలించిన వాడు దాన్ని తెచ్చి నా కిస్తే క్షమించి వదిలేస్తాను. దొంగ ఎవరో ఈ చిలుక క్షణంలో చెప్పగలదు. ఐనా దొంగను శిక్షించే ఉద్దేశం నాకు లేదు. ఆ కారణం వల్ల దొంగను తానుగా బయటపడి, క్షమాపణ పొందమని కోరుతున్నాను," అన్నాడు.

సభలో ప్రతి ఒక్కరూ రాజుగారి ఔదార్యాన్ని ప్రశంసించారు.

ఆ రాత్రి రాజుగారు భోజనానంతరం విశ్రాంతి తీసుకుంటూండగా ఒక భటుడు తొట్రుపడుతూ వచ్చి, వజ్రాల హారాన్ని రాజుగారికి ఇచ్చి, రాజుగారి కాళ్ళ మీద పడి, క్షమాపణ చెప్పుకున్నాడు. హారం తిరిగి దొరికిన సంతోషంలో రాజుగారు వాణ్ణి అప్పుడు ఏమీ అనలేదుగాని, తరవాత వాడికి దేశ బహిష్కరణ శిక్ష విధించి, దేశం నుంచి పంపేశాడు.

దొంగను పట్టుకోవటానికి రాజూ, అతని మంత్రి దేవవర్మా కలిసి వేసిన పథకం గురించి ఎవరికీ తెలియదు.

సాధువు అంటూ వేషం మార్చుకుని వచ్చినవాడు రాజుగారి బావమరిది. అతనిది ఈ దేశం కాదు. ఆ చిలుక అతని పెంపుడు చిలుక. దానికి చిన్నతనం నుంచీ మాటలు నేర్పారు. అది ఏ పరిస్థితులలోనూ తానై దొంగ పేరు చెప్పగలిగి ఉండేది కాదు. కాకపోతే అంతఃపుర నౌకర్ల పేర్లు కొన్ని వికరువు పెట్టింది.

చిలుకను దగ్గిర పెట్టుకుని కూడా రాజు, దొంగను తానై బయటపడమనటంలో ఔదార్యం ఏమీలేదు. చిలుక దొంగను అదరగొట్టటానికి మాత్రమే ఉపయోగపడింది.






రాముడు రథం మీద నిలబడి తన పైకి బాణ ప్రయోగం ప్రారంభించేసరికి, రావణుడు కోపంతో ఉగ్రుడై పోయి, రాముడి మీద గాంధర్వాస్త్రాన్ని వేశాడు. దివ్యాస్త్రాల ప్రభావం క్షుణ్ణంగా ఎరిగి వున్న రాముడు గాంధర్వాస్త్రాన్ని, గాంధర్వాస్త్రంతోనూ, తరవాత రావణుడు వేసిన దైవాస్త్రాన్ని, దైవాస్త్రంతోనూ తునాతునియలు చేశాడు.

ఈసారి రావణుడు, రాముడి మీద మహా భయంకరమైన రాక్షసాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రం నుంచి వెలువడిన అనేక విషసర్పాలు, తమ నోళ్ళ వెంట మంటలు కక్కుతూ, రాముడి కేసి రాసాగినై. రాముడు వెంటనే వాటి పైకి గరుడాస్త్రాన్ని ప్రయోగించాడు. దానిలోనుంచి వెలువడిన గరుడపక్షులు, రావణుడు ప్రయోగించిన విషసర్పాలను తమ నోళ్ళతో పట్టి సంహరించినై.

రావణుడు యిది చూసి మరింత కోపోద్రిక్తుడై, రాముడి మీదా, రథసారథి అయిన మాతలి మీదా బాణవర్షం కురిపించాడు. ఒక శక్తివంతమైన బాణంతో రాముడెక్కి వున్న రథపు ధ్వజస్తంభాన్ని పడగొట్టాడు. మరికొన్ని బాణాలతో రథాశ్వాలను నొప్పించాడు. ఆకాశంలో వుండి అతి దారుణమైన యీ రామ రావణ యుద్ధాన్ని చూస్తున్న దేవతలు, గంధర్వులు, చారణులు పరమ దుష్టుడైన రావణుడు, రాముణ్ణి తన బాణాలతో



లోనే నిన్నూ, నీ తమ్ముణ్ణీ చంపి, మహా శూరులైన రాక్షసులను వధించినందుకు నీ మీద పగ తీర్చుకో బోతున్నాను,'' అంటూ రాముడి కేసి విసిరాడు.

రావణుడు అలా విసిరిన శూలం జ్వాలలతోనూ, మెరుపులతోనూ ప్రళయ భయంకరంగా గర్జిస్తూ, రాముడి కేసి రాసాగింది. రాముడు దానికేసి ప్రయోగించిన బాణాలన్నీ, దాన్ని తాకి భస్మమై పోయి, బూడిద గాలిలోకి లేచింది. రాముడు ఆ సరికి రావణుడు వదిలిన మహాస్త్రం ఎంత శక్తివంతమైనదో గ్రహించి, ఇంద్రుడు తన రథంతోపాటు పంపిన మహా శక్తిని దానిమీద ప్రయోగించాడు. రావణుడు ప్రయోగించిన శూలం రెండుగా విరిగి, నేలకూలింది.

ఆ వెంటనే రాముడు విజృంభించి, రావణుడి మీద వివిధాస్త్రాలు ప్రయోగించసాగాడు. తాను వేసిన మహాశక్తి యీ విధంగా నిష్ప్రయోజనం అవటం చూసి, రావణుడు దిగులుపడ్డాడు. ఇప్పుడు రాముడు వేసే బాణాల నుంచి ఆత్మరక్షణ కూడా చేసుకోలేని స్థితికి దిగజారాడు. అది గమనించిన రావణుడి రథ సారథి, రథాన్ని యుద్ధరంగం నుంచి దూరంగా తోలుకుపోసాగాడు. రాక్షసులు భయకంపితులై హాహాకారాలు చేశారు.

బాధించటమేగాక, దేవేంద్రుడి రథపు ధ్వజాన్ని కూలవేసినందుకు చాలా విచారపడ్డారు. విభీషణుడితో పాటు వానరులందరూ యుద్ధంలో రావణుడిది పైచెయ్యి కావటం చూసి కలతచెందారు.

రాముణ్ణి సంహరించటానికి యిదే మంచి అదనని భావించిన రావణుడు ఇంద్రుడి వజ్రాయుధంతో సమానమైన ఒక శూలాన్ని చేతికి తీసుకున్నాడు. అది పొగలు చిమ్ముతూ, మంటలు కక్కుతూ మహా భయంకరంగా వున్నది.

రావణుడు ఆ జ్వలిస్తున్న శూలాన్ని ఎత్తిపట్టుకుని రాముడితో, ''ఓం, రాముడా! ఇదుగో, నీ పాలిటి మృత్యువు! ఈ క్షణం



తన రథం ఆ విధంగా యుద్ధభూమిని వదిలి కొంతదూరం పోగానే, రావణుడు తేరుకుని, రథ సారథిపై ఆగ్రహం చెంది, ''ఓరీ, దుష్టుడా! నా అనుమతి లేకుండా రథాన్ని యుద్ధరంగం నుంచి ఎందుకు మళ్ళించావు? నే నేమైనా పిరికివాణ్ణీ, అసమర్థుణ్ణీ అనుకుంటున్నావా? అస్త్ర ప్రయోగం చేతకానివాణ్ణీ, యుద్ధంలో శౌర్య ప్రతాపాలూ, అవసరం అయితే యుక్తులూ ప్రదర్శించలేని వాణ్ణనుకుంటున్నావా? ఛీ, యీ మతిమాలిన పని ఎందుకు చేశావు? శత్రువుల నుంచి ఏమైనా లంచం పుచ్చుకున్నావా? వెంటనే రథాన్ని యుద్ధరంగం మధ్యకు నడుపు,'' అన్నాడు.

ఈ పరుష వాక్కులకు సారథి ముఖం చిన్నబుచ్చుకుని, రావణుడితో, ''మహారాజా! నీ క్షేమం కోరినవాణ్ణి గనక.నే, రథాన్ని యుద్ధరంగం నుంచి దూరంగా నడిపాను. రాముడు చేసే అతి తీవ్రమైన యుద్ధానికి, నీవు తగిన విధంగా ప్రతి యుద్ధం చేయటంలేదు. నీవు బాగా అలిసి వున్నావు. రథాశ్వాలు కూడా బాగా డస్సిపోయి వున్నాయి. నీకూ, వాటికీ కొంత విశ్రాంతి అవసరం అని రథాన్ని యిలా నడుపుకు వచ్చాను. యుద్ధరంగంలో రథాన్ని ఎప్పుడు ఎలా నడిపించాలో తెలియకపోతే, నేను సారథి నెలా అవుతాను? ఇప్పుడేం చెయ్యమని ఆజ్ఞ?'' అన్నాడు.

సారథి ఇలా అనగానే, రావణుడు అతడి రాజభక్తికీ, సమయస్ఫూర్తికీ మెచ్చి, అతడికి విలువైన ఒక హస్త కంకణాన్ని బహూకరించి, ''రాముణ్ణి యీ క్షణంలోనే, నా బాణ ఘాతానికి బలి చెయ్యబోతున్నాను. నేను అలసి వున్నానని సంశయించక రథాన్ని, అతడి కేసి తీసుకుపో,'' అన్నాడు.

సారథి రథాన్ని రాముడి ముందుకు తెచ్చి నిలిపాడు. ఆ సమయంలో రాముడు బాగా అలిసిపోయి, రావణుడితో యుద్ధం



విల్లంబులు చేతబట్టి, రావణునితో యుద్ధం చేసేందుకు ముందుకు వచ్చాడు.

రాముడు రథసారధి అయిన మాతలితో, "మాతలీ! ఇప్పుడు రావణుణ్ణి నిశ్చయంగా చంపబోతున్నాను. నువ్వు రథాన్ని ఎంతో ఒడుపుగా, చాకచక్యంతో నడపవలసి వుంటుంది. దేవేంద్రుడి రథసారధివయిన నీకు యింతగా చెప్పవలసిన అవసరం లేదని నాకు తెలుసు. అయినా, నువ్వేమాత్రం ఏమరుపాటూ, అజాగ్రత్తా లేకుండా రథం నడపటం అవసరం అని, యిలా హెచ్చరిస్తున్నాను," అన్నాడు.

మాతలి రథాశ్వాలను గట్టిగా అదిలించి, రథం వేగంగా కదిలేటప్పుడు రేగిన దుమ్ము, రావణుణ్ణి చుట్టుముట్టేలా చేశాడు. రావణుడు యిది చూసి కోపోద్రిక్తుడై, రాముడి మీద బాణవర్షం కురిపించాడు. రాముడు తనకు ఇంద్రుడు పంపిన విల్లూ, బాణాలూ తీసుకుని రావణుడితో యుద్ధానికి ఉపక్రమించాడు.

రామ, రావణుల మధ్య యుద్ధం అతి భయంకరంగా సాగింది. రెండు శత్రు పక్షాల వీరులూ యుద్ధం మాని, వాళ్ళ ద్వంద్వ యుద్ధాన్ని భయాశ్చర్యాలతో చూడసాగారు. రాముడూ, రావణుడూ కూడా యిదే తమ అంతిమ పోరాటం అన్నంత తీవ్రంగా యుద్ధం చేశారు.

చేసే శక్తిలేని స్థితిలో వున్నాడు. రామ, రావణ యుద్ధం చూడవచ్చిన దేవతలతో పాటు వున్న అగస్త్యమహర్షి అది గమనించాడు. ఆయన త్రికాలజ్ఞుడు. ఆయన రాముడి వద్దకు వచ్చి, "రామా, నీ అలసట పోయేందుకూ, తిరిగి నీలో యుద్ధోత్సాహం కలిగేందుకూ, నీకు అదిత్యహృదయం అనే స్తోత్రం చెబుతాను. అది సర్వ స్తోత్రాలలోనూ ఉత్తమమైనది. దానిని జపించి, తిరిగి శక్తివంతుడవై రావణునితో యుద్ధం చెయ్యి," అని రాముడికి అదిత్య హృదయం బోధించి, వెళ్ళిపోయాడు.

రాముడు ఆ స్తోత్రాన్ని మూడుసార్లు జపించి, ఇనుమడించిన బలోత్సాహాలతో



ఇలా కొద్దిసేపు యుద్ధం జరిగాక రాముడు ప్రయోగించిన అతి తీక్షణమైన బాణం దెబ్బకు, రావణుడి శిరస్సు తెగి నేలమీద పడింది. కాని, అదే క్షణంలో రావణుడికి మరొక శిరస్సు పుట్టుకొచ్చింది. రాముడు మరొక వాడి బాణంతో ఆ శిరస్సును కూడా ఖండించాడు. అది నేలబడే లోపుగా రావణుడికి మరొక శిరస్సు మొలిచింది.

రాముడు ఈ విధంగా నూట ఒక్క సార్లు రావణుడి శిరస్సు ఖండించాడు. కాని, ప్రతిసారీ రావణుడికి మరొక శిరస్సు మొలవటంతో, అతడు మరణించ లేదు. ఇది చూసి రాముడికి చాలా ఆశ్చర్యం కలిగింది. లోగడ తాను దండకారణ్యంలో విరాధుణ్ణీ, క్రౌంచారణ్యంలో కబంధుణ్ణీ వధించేందుకు ఉపయోగించిన బాణాలు రావణుడి పట్ల ఎందుకు వృధా అవుతున్నవో అతడికి అర్థంకాలేదు.

రామ రావణులు యీ విధంగా ఒక్క క్షణమైనా విశ్రాంతి లేకుండా ఏడు పగళ్ళూ, ఏడు రాత్రులూ యుద్ధం చేశారు. రాముడి బాణాలు రావణుడి మీద ఎందుకు వ్యర్థమవుతున్నవో మాతలికి తెలుసు. కారణం, రావణుడి మరణ కాలం యింకా సమీపించలేదు.

ఎనిమిదవనాడు రావణుడి అంత్య కాలం సమీపించిందని తెలియగానే మాతలి, రాముడితో, "రామా, యిదే మంచి సమయం. ఇక తాత్సారం చేయక, యీ దుష్ట రావణుడి పైన బ్రహ్మాస్త్రం ప్రయోగించి, వధించు," అన్నాడు.

మాతలి యిలా హెచ్చరించగానే రాముడు, భయంకర సర్పంలాటి బాణాన్నొకదాన్ని చేతికి తీసుకున్నాడు. దేదీప్యమానంగా వెలిగిపోతున్న ఆ బాణాన్ని బ్రహ్మ ఒకప్పుడు ఇంద్రుడి కోసం సృష్టించాడు. అది చాలా బరువైనది, పెద్ద పెద్ద రెక్కలు గలది, వజ్రంలాగా అతి కఠినమైన ఆయుధాలను సహితం ఛేదించ

గలది. రాముడు ఆ సర్వశక్తిమంతమైన మహాస్త్రాన్ని, వేదోక్తంగా మంత్రించి, ఎక్కుపెట్టి, రావణుడిపైన వేశాడు. అది రావణుడి రొమ్మును ఛేదించి, అతడి వీపులోంచి దూసుకుపోయి బయిటికి వచ్చింది. రావణుడు తన చేతగల ధనుర్బాణాలను జారవిడిచి, ప్రాణాలు పోగా, రథం మీదినుంచి నేలమీద పడ్డాడు.

తమ రాజు మరణించటం చూస్తూనే రాక్షసులు గుండెలవిసి, హాహాకారాలు చేస్తూ లంకానగరం కేసి పారిపోసాగారు. వానరులు విజయధ్వానాలు చేస్తూ, పెకలించిన వృక్షాలూ, యితర ఆయుధాలూ పట్టుకుని, వాళ్ళను వెంటదగిలి, అందిన వారిని అందినట్టు చంపసాగారు.

రావణుడు చావగానే దేవదుందుభులు మోగాయి. ఆకాశం నుంచి పుష్పవర్షం కురిసింది. వానరులతోపాటు ఆకాశంలోని దేవతలూ, గంధర్వులూ, చారణులూ రాముణ్ణి గొప్పగా స్తుతించారు. సుగ్రీవుడూ, అంగదుడూ చాలా ఆనందపడ్డారు. విభీషణుడూ, వానర ముఖ్యులూ రామలక్ష్మణులను ప్రశంసించారు.

విభీషణుడికి తన అన్న మరణం చాలా దుఃఖం కలిగించింది. సీతను అపహరించి తెచ్చి దుర్మరణం పాలయాడే గాని, అతను నిజంగా మహాపురుషుడని



చెప్పదగినవాడు. గొప్ప తపశ్శాలి, పండితుడు, నిష్ఠాపరుడు, అసమాన శౌర్య పరాక్రమవంతుడు!

అన్న మరణించినందుకు యిలా దుఃఖ వివశుడైన విభీషణుణ్ణి, రాముడు ఓదార్చుతూ, "రావణుడు పిరికివాడులా మరణించలేదు; వీరుడులాగా పోరాడుతూ యుద్ధరంగంలో మరణించాడు. ఎంత మహావీరుడైనా యుద్ధంలో శత్రువు చేత హతుడు కావచ్చు. వీరుడిలా మరణించి, వీరస్వర్గం చేరిన వాడికోసం శోకించ కూడదు." అన్నాడు

తరవాత రాముడి అనుమతి తీసుకుని విభీషణుడు, తన అన్నకు శాస్త్రోక్తంగా

దహనక్రియలు జరిపేందుకు ఏర్పాట్లు చేయసాగాడు.

రావణుడి మరణవార్త తెలియగానే అతని భార్యలు అంతఃపురం నుంచి బయలుదేరి, ఉత్తర ద్వారంగుండా యుద్ధభూమికి వచ్చి, అక్కడ రావణుడి శవాన్ని చూసి, దానిపైనపడి గుండెలు అవిసేలా విలపించారు. విభీషణుడు చెప్పినట్టు సీతను, రాముడికి యిచ్చి వున్నట్టయితే, ఈ విపత్తు సంభవించేది కాదని ఆక్రోశించారు. "మూడు లోకాలనూ జయించి, దేవతలంతటి వారిచేత ఊడిగం చేయించుకున్న నీవు, చివరకు ఒక మానవమాత్రుడి చేతిలో ప్రాణాలు కోల్పోయావా ?" అంటూ మండోదరి విలపించింది.

రాముడు, విభీషణుణ్ణి దగ్గిరకు పిలిచి, "విభీషణా, యీ శోకించే స్త్రీలందరినీ వెంటనీ అంతఃపురానికి పంపి, త్వరగా నీ అన్నకు ఉత్తర క్రియలు చెయ్యి," అని చెప్పాడు.

ఆఖరిక్షణంలో విభీషణుడికి ఒక ధర్మ సందేహం కలిగింది. తన అన్న యితరత్రా ఎంత ధర్మపరుడూ, మహాజ్ఞానీ అయినా, పర స్త్రీని చెరబట్టి తీసుకురావటంతో, పరమనీచుడూ, దుష్టుడూ అయిపోయాడు. అలాంటి వాడికి తాను అగ్నిసంస్కారం లాంటి కర్మలు చేయటం ధర్మవిహితమైన కార్యం అవుతుందా ?

ఈ సందేహాన్ని విభీషణుడు రాముడికి వెల్లడించినప్పుడు రాముడు, రావణుడి యితర గుణగణాలను ప్రశంసించి, "నీ అన్నకు నీ చేతి మీదుగా ఉత్తరక్రియలు జరపటం పూర్తిగా ధర్మ సమ్మతం," అన్నాడు.

బ్రాహ్మణులు చందనపు చెక్కలతో చితిపేర్చి, దానిపైన ఒక గొంగళి పరిచి, రావణుడి శవాన్ని అలంకరించి, దానిపైన పడుకోబెట్టారు. విభీషణుడు చితికి నిప్పు పెట్టాడు. తరవాత అతడు స్నానం చేసి, నీళ్ళు వదిలి, రావణుడి భార్యలను లంకకు పంపి, రాముడి దగ్గిరకు వచ్చాడు.





# దోషి సుల్తాను విచారణ

బెంగాల్‌ను పరిపాలించిన పఠాన్ జాతీయుడైన సుల్తాన్ గియాసుద్దీన్‌కు వేటాడటం అంటే చాలా సరదా. అయన తన నివాసభవనానికి దాపుల వున్న అరణ్యాన్ని, తన వేటవిహారానికి ప్రత్యేకించుకున్నాడు.



ఒకనాటి ఉదయం సుల్తాను వేటాడేందుకు అరణ్యానికి పోయాడు. అక్కడ అతడి కొక లేడి కనిపించింది. కాని, పరిగెత్తి పోతున్న లేడిని గురి చూసి కొట్టటం అంత తేలిక కాదు. సుల్తాను కొంతదూరం లేడిని వెంట తరిమి, బాణం వదిలాడు. బాణం గురి తప్పి ఒక బాలుడికి తగిలింది.



బాలుడి రోదనం విని, అతడి తల్లి పరిగెత్తుకుంటూ వచ్చింది. ఈ లోపల సుల్తాను నరాసరి తన భవనానికి పోయి, గాయపడిన బాలుడికి చికిత్స చేసేందుకు వైద్యుణ్ణి పంపాడు. కాని చికిత్స నిష్ప్రయోజనమై, బాలుడు మరణించాడు.



బాలుడి తల్లికి, తన కుమారుణ్ణి బాణంతో కొట్టినవాడు సుల్తానని తెలియదు. ఆమె సుల్తాను భవనానికి పరిగెత్తిపోయి, గంట మోగించింది. సుల్తాను డాబా పైకి రాగానే ఆమె, "నా కొడుకును అరణ్యంలో బాణంతో కొట్టి చంపారు. ఆ అరణ్యం మీది గసక, ఆ మనిషి ఎవరైనా, మీ వాడే అయివుంటాడు. తమరు దోషిని శిక్షించాలి," అని వేడుకున్నది.



సుల్తాను నిబ్బరంగా ఆమెతో, "అమ్మా, దోషిని విచారించి, న్యాయనిర్ణయం చేయవలసినవాడు, ఖాజీ. నువ్వక్కడికి పోయి, ఫిర్యాదు చెయ్యి," అన్నాడు.



ఆమె, ఖాజీ దగ్గిరకు పోయి, జరిగిన సంగతి చెప్పింది. బాలుడు బాణం దెబ్బ తిన్న ప్రదేశం పేరు వింటూనే, ఖాజీకి ఆ బాణం వదిలిన వాడు సుల్తానయి వుంటాడన్న అనుమానం కలిగింది. ఆ అరణ్యానికి సుల్తాను తప్ప మరెవరూ వేటకుపోరు. అతడికి ఏమి చేసేందుకూ పాలుపోలేదు.

తరవాత కొద్దిసేపట్లోనే సుల్తాను తన నౌకరు ద్వారా ఖాజీకి ఒక ఉత్తరం పంపాడు. "నేను లేడిపైకి వదిలిన బాణమే, గురి తప్పి బాలుడికి తగిలి, అతడి చావుకు కారణం అయింది. మీరు చేయగలిగింది చేయండి," అని ఉన్నదా ఉత్తరంలో. "సుల్తాను యీ గొడవంతా బయిటికి పొక్కకుండా చేయమంటున్నాడా?" అనుకున్నాడు ఖాజీ.





ఖాజీ దీర్ఘంగా ఆలోచించి, ఒక దృఢ నిశ్చయానికి వచ్చి, సుల్తానును తన న్యాయస్థానంలో హాజరు కావలసిందిగా కబురు చేశాడు. ఈ సంగతి పది మందికీ తెలిసింది. న్యాయస్థానానికి వెళుతున్న సుల్తాను వెంట జనం గుంపులుగా బయలుదేరారు.

సుల్తాను న్యాయస్థానం చేరగానే ఖాజీ తప్ప, అక్కడ వున్న వాళ్ళంతా లేచి నిలబడ్డారు. "సుల్తాను నాకు మరణ శిక్ష విధించినా ఫర్వాలేదు. నేను మాత్రం నిర్భయంగా ముందు అతణ్ణి విచారించి, కొడుకును పోగొట్టుకున్న స్త్రీకి న్యాయం కలిగిస్తాను," అనుకున్నాడు ఖాజీ.





సుల్తాను తన ముందుకురాగానే ఖాజీ ఆయనతో, "నువ్వు నేరాన్ని అంగీక రించావు. నీ పొరబాటే బాలుడి మర ణానికి కారణం అయింది. అతడి తల్లి నిన్ను క్షమిస్తాసంటే తప్ప, లేకపోతే నీకు తగినశిక్ష విధించవలసివుంటుంది," అన్నాడు.



సుల్తాను వెంటనే ఆ స్త్రీని క్షమాభిక్ష వేడుకుని, ఆమెకు నష్టపరిహారం కింద, పెద్ద మొత్తంలో బంగారు మొహరీలు యిచ్చాడు. ఆమె ప్రసన్నురాలై ఖాజీతో సుల్తానును క్షమించానన్నది.



మరుక్షణం ఖాజీ, "హుజూర్, నేర విచారణ ముగిసింది కనక, ఇక తమరు సుఖాసీనులు కండి," అన్నాడు. సుల్తాను చిరునవ్వునవ్వి, తన దుస్తుల చాటునుంచి కొరడా ఒకటి బయటికి తీసి, "నువు సరిగా న్యాయవిచారణ జర పకపోతే, పదిమంది ఎదటా నిన్ను యీ కొరడాతో కొట్టదలిచాను. నీ వంటివాడు ఖాజీ కావటం నాకెంతో గర్వకారణం!" అంటూ ఖాజీని సాదరంగా కౌగలించు కున్నాడు.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

?

వేయ్ రాజవంశ పరిపాలనా కాలంలో సు యున్ అనేవాడు పౌరశాఖలో పనిచేస్తూ, ఆ శాఖ నిండా తన ప్రాంతం మనుషులను వేసుకున్నాడు. ఇది తెలిసి మింగ్ చక్రవర్తి అతన్ని పట్టుకు రమ్మని భటులను పంపాడు.

తన భర్త చక్రవర్తి వద్దకు వెళ్లేటప్పుడు సు యున్ భార్య, "చక్రవర్తితో వాదించు గాని, క్షమాపణ మాత్రం చెప్పకోకు," అని సలహా ఇచ్చింది.

సు యున్ చక్రవర్తితో, "ఎవరైనా తెలిసిన మనుషులనే ఉద్యోగంలో వేసుకోవాలి. నేను ఆ పనే చేశాను. వాళ్ళు దక్షతతో పని చేస్తున్నారో, లేదో చూడండి. వారి పని బాగులేకపోతే నేను దోషినే!" అన్నాడు.

రాజభటులు సు యున్‌ను పట్టుకుపోయారంటే అతని బంధువులందరూ విలపించారు. అతని భార్య మటుకు, "ఎందుకు విచారిస్తారు? ఆయన తిరిగి వస్తాడు," అనటమేగాక అతనికి వంట కూడా చేసింది. ఆమె అన్నట్టే అతను తిరిగివచ్చేశాడు.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, **2 & 3** ఆర్కాట్‌రోడ్డు, వడపళని, మద్రాసు **600 026** అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలించబడవు.

కార్డులు మాకు ఆగస్టు **20** లోగా చేరాలి. అందులో ఫొటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, **'77** అక్టోబరు చందమామలో ప్రకటింపబడతవి.

---

జూన్ నెల పోటీ ఫలితం: పెనము నుండి పొయ్యిలో పడినట్లు

గెలుపొందిన వారి పేరు: ఆర్. భాస్కర్, **1-10-348**, బేగంపేట, హైదరాబాదు.

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1977 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



Gopal Shroti





S. Ravindran

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ అగస్టు నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నేరం చెయ్యని ఖైదీలు

రెండవ ఫోటో : మోసం.చెయ్యని స్నేహితులు

పంపినవారు : కె. వెంకటేశ్వర్లు, అశోక్ నగర్, విజయవాడ-7

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

‘మీ నోటిలో
సంగీతం పలికించండి’






